# ఆంధ్రపంచకావ్యములు.

పండితప్రవరులార !

పంచకావ్యము లని యాంధ్రులు సాధారణముగా సంస్కృతమునందలి కాళిదాసకృతరఘువంశకుమారసంభవమేఘసందేశములను, భారవికృతకిరాతార్జునీయమును, మాఘప్రణీతశిశుపాలవధమును బిలుచుచున్నారు. ఇందు మొదటి మూఁడింటికిఁ గాళిదాసత్రయ మని పేరు. మాపిల్లవాఁడు కావ్యశ్లోకములు పట్టినాఁ డని స్త్రీలు కూడఁ జెప్పుదురు. నేను గాళిదాసత్రయము చదివినాఁడ నని, పంచకావ్యములు చదివితి నని, ఎఫ్. ఏ. బి. ఏ. లవలెఁ దమతమపాండిత్యమును సర్వసాధారణముగాఁ దెల్పుకొనుచున్నారు. పూర్వులు కొందఱు కవులు ప్రబంధకవులుగాక శతకాదులు రచించినవారు, "నే నమరము చదువలేదు. లక్షణమెఱుఁగను, బంచకావ్యశ్లోకపఠన లేదు." అను మొదలైనవాక్యములతో వినమ్రభావముం గనఁబఱుచుకొనుచువచ్చిరి. పంచకావ్యములం జదువకుండఁ బెఱనాటకములో యలంకారగ్రంథములో చూచువారు కారు కాని, రఘువంశము చదివినార మని మొదటి మూఁడుసర్గములు మాచూడక నాల్గవసర్గముఁ బ్రారంభింతురు. మావాఁడు "సరాజ్య" మని మైన నన లే దందురు. ఈకావ్యములోఁ దొమ్మిదవసర్గములోని "హాతాతేతిక్రందితమాకర్ణ్య" అనుదీనికర్థమే చెప్పరు. ఎనిమిదవసర్గములో నిందుమతీవిలాప మున్నది. మూఁడునాలుగుసర్గములైనంతనే కుమారసంభవము మొదలిడుదురు. ఇందునాలవసర్గమున రతివిలాప మున్నది. ఆపాంతకుఁ బోరాదు. ఇట్లే దేఁకి దేని కే దేదియో మిషలు పెట్టి యొక్కొక్కదానిలో మూఁడేసి నాల్గేసి సర్గములు మాత్రమే చదివి పంచకావ్యములు చదివితి మని చెప్పుచుందురు. వినోదమునకైనఁ బిమ్మటఁ దక్కినసర్గములలో నేమియున్నదో విద్యార్థులును జూడరు. చదువు మని గురువులును జెప్పరు; ఇట్టి మనయాంధ్రపండితుల ప్రోత్సాహముననే తెనుఁగక్షరములతో నిప్పుడు పంచకావ్యములలో నొక్కటియుఁ బూర్తిగ దొరకదు. మేఘసందేశము ఖండకావ్యమే గదా ! ఏకావ్య మెన్నిసర్గములు గలదో తెలియని విద్యార్థు లున్నా

రనుట దోషము కాదు. అత్తయు నొకయింటికోడలే—ఇఁక ముద్రాయంత్రము
లవా రేయవలంబము చూచికొని యా కావ్యములను బూర్ణముగ ముద్రింతురు.
ఆంధ్రాక్షరములలో నచ్చుపడిన వన్నియు మనయాంధ్రులకుఁ గావలసినన్ని సర్గములు
మాత్రమే కలిగి యున్నవి. మల్లినాథసూరిగారు వ్యాఖ్యానము చేయునాఁటి
కీవెల్లు లున్నటులు తోఁపదు. ఉన్నచో నాయాకావ్యములలోని ముఖ్యభాగము
లకే వ్యాఖ్యానములు వ్రాసియుందురు. ఎవ్వరును జదువని దానికై యరణ్య
రోదనమువలె నంతలంతలు వ్యాఖ్యానములు వ్రాసియుండరు. పూర్వాచారవి
రోధమున కాయనయును భీతిల్లియుండును. "మాఘే మేఘే గతం వయః"
అని యాయన తనప్రాణములు వ్యాఖ్యానములకై ధారపోసినట్లు పెద్దలు తెల్పు
చున్నారు. పాప మామహామహోపాధ్యాయుల యింటిచూరులు వాసములు
దూలములు వ్యాఖ్యానములకు విసిగిపోయినవి. ఇత్యర్థములు పులుసులోను నితి
భావము లిగురులోను బడినవి. ఎప్పటినుండి యీపంచకావ్యపఠన మారంభ
మైనదో తెలియదు. పంచకావ్యయుగముం దెలిసికొన్నవారు వ్రాసెదరని కోరు
చున్నాఁడను. చంద్రునకు బుధుఁ డుద్భవింపకమునుపు బుధవారము లేదనురీ
తిగాఁ గాళిదాసునకు ముందు కాళిదాసత్రయ ముండదుగదా. కాళిదా సేపంచ
కావ్యములు చదివెనో. ఆంధ్రేతరదేశములలో నేదో యొక సంస్కృతగ్రంథమును
గురువునొద్దఁ బూర్ణముగాఁ జదువుకొని తర్వాత బుద్ధిబలమున నితరగ్రంథము
లను వారివారికాలములందు దొరకు సాహిత్యగ్రంథములను, జదివి, ముఖ్యముగా
శ్రీమద్రామాయణముఁ బఠించి భాషాజ్ఞాన మలవఱచుకొని పిమ్మట శాస్త్రా
భ్యాసమునకుఁ గడంగుదురు. పంచకావ్యములకే శాస్త్రులు కావుటలేదు. సాధా
రణముగాఁ బూర్వము శ్రీమద్రామాయణముమీఁదనే సాహిత్యపరిచయముం
బొందుచుండిరని వినికి. ఆవాసనతగిలియే "తాంబూలార్థ మక్షతాన్ సమర్ప
యామి" యని మనవారు నవలంబించి బాలురచే బాలరామాయణము గ్రుడ్డి
పాఠము చేయించుచున్నారేమో.

ఒక్కయుత్తరదేశవిద్యార్థి తాను "భర్తృహరిశతకత్రయము" మీఁదనే
దానివ్యాఖ్యానసహాయమున సాహిత్యజ్ఞానము సంపాదించుకొని కౌముది చదివి
నట్లు చెప్పినాఁడు. ఇవు డిపుడు గాని కొంతకాలమునకుఁ బూర్వ మఱవదేశము
నందును బంచకావ్యములు చదువవలయు ననునియమ మున్నట్లు కొందఱు చెప్ప
లేదు. కలకత్తా మొదలగునగరములలోఁ గావ్యపరీక్షలు, కావ్యతీర్థబిరుదములు

వినవచ్చుచున్నవి. ఆకావ్యము లేవియో ! ఏదియెట్లున్నను బంచకావ్యప్రచార మె
క్కుడు మనయాంధ్రులం దుండుట సువిదితము. కావుననే యాంధ్రవిద్యార్థుల
కొఱకును, నాంధ్రపంచకావ్యములను మనపెద్దలు నిశ్చయించిరి. కవిజీవితముల
లో నాంధ్రపంచకావ్యకవులచరిత్ర మని యొకప్రత్యేకభాగ మున్నది. కాని నేను
వివరింపఁబోవు పంచకావ్యములకు దానిలోనివానికిఁ గొంత భేద మున్నది.
“ నాటకాంతంహిసాహిత్య ”మ్మను సంస్కృతవిద్యాభ్యాసవిషయకారికను దెనుఁ
గువిద్వాంసు లేల యుపేక్షించిరో, యాంధ్రపంచకావ్యము లైన పిమ్మట సా
హిత్యము కుదురుట కొక్కనాటక మైన నిర్ణయించి యుండలేదు. ఆహేతువుచే
తనే కావచ్చును నరసభూపాలీయములోఁ బ్రతాపరుద్రీయముం దెనిఁగించినను,
మూర్తికవి నాటకప్రకరణమును విడిచినాఁడు. అదియో మఱి యేదియో కారణ
మై యుండును; ఒట్టుపెట్టిన ట్లొకరును సంస్కృతనాటకము నొకదానిని దెనిఁగిం
పక విడిచిరి. కొందఱు నాటకరీతిం దెనిఁగింపక, శాకుంతలము, ప్రబోధచంద్రో
దయము, అనర్ఘరాఘవము, విద్ధసాలభంజిక మొదలగువానిని గావ్యసరణిని దిం
పుటకుఁ గతము నాటకలక్షణ మంగీకరింపఁబడకపోవుటయో నాటకములలోని
కల్పనావైచిత్రిని లోకమునకుఁ దెల్పకుండ నూఱకుండలేకపోవుటయో యై యుం
డును. సంస్కృతప్రాకృతములవలెఁ దెనుఁగున రెండువిధముల భాష లేకపోవు
టయో, నాటకలక్షణము తెనుఁగున లేనికారణమో, మున్నాంధ్రీకరణమునకును
స్వతంత్రనాటకనిర్మాణమునకును బ్రతిబంధక మైయుండును. సంస్కృతపంచకావ్యము
లందు వలెను గవిజీవితములందువలెను నాయాంధ్రపంచకావ్యములందును భా
షాపాటవమును బట్టియేకాని కవులకాలమును బట్టి క్రమము నిర్ణయింపఁబడ
లేదు. సంస్కృతకావ్యములలోఁ గాళిదాసెవరు ? ఏకాళిదాసు ? ఏకావ్య మేకా
ళిదాసుది యనుచు విత్తు ముందా చెట్టు ముందా యని వాదింపవలసియున్న
దఁట. ఆంధ్రకావ్యములసంగతి యెత్తుకొంటిమా పెద్దనార్యుని కృష్ణరాయ లె
వరు. తిమ్మనార్యుని తోఁటకూరమడి కృష్ణరాయలెవ్వరు ? కళింగగంగు విరోధి
రాయ లెవ్వరు ? శ్రీనాథుని కాలమునందలి రాయ లెవ్వరని శంకలు పొడ
మును. అసమర్థుఁడ నగునే నీవిషయమై రాఁబోవు నావిమర్శనములోఁ గాని,
వ్రాయఁబోవు నాచరిత్రములోఁ గాని సవిస్తరముగా విస్మృతవిచారము చేయు
చున్నాఁడ నని యాసపెట్టను. ఈకావ్యములు నాకు నచ్చలేదు కావున నేనే
పంచకావ్యములు తరగతులనుబట్టి రచింపఁబోవుచున్నాఁడ నని లోకము నూరిం

పను. నాకుఁ గావలసినది యున్నపంచకావ్యములవలనిలాభము. కవు లెప్పటివా రైనను బనిలేదు. తత్తత్సమయముల మాకు వేరిం. దెల్పవలయునో వానిని సవిర్శముగాఁ దెల్పుటకుఁ బండితులు మీరే యున్నారు.

సంస్కృతపంచకావ్యపఠనముం గాంచి మనవారాంధ్రమునను గొంతసంస్కారము చేసిరి ఈయాశ్వాసము చదువరాదు; ఈయాశ్వాసమును జదువవలయు నను నిర్బంధ మీతెనుఁగున నేర్పడలేదు. కాని పూర్వాచార మేల యుల్లంఘింపవలయు నని యాశ్వాసములకు మాఱు కావ్యములే చదువఁబడకుండ విడిచిపెట్టఁ బడుచున్నవి. సంస్కృతవిద్యాబలము గలవారము మాకుఁ దెలుఁ గెంతపాటిది యను నహంభావము కొందఱు విద్యార్థుల నావహించుటయే దీనికిఁ గారణము. ఈమాట నాకపచారదోషము గలిగింపకుండుంగాక. చదువకుండఁగానే మేము విద్యను సాధింతు మనువారు భారతములోని భారద్వాజుని కథను బూర్తిగాఁ జదివియుండరు. ఎంత చెడినను దెనుఁగు కూడ నొక స్వతంత్రభాషయే గదా! ఒకభాష నేర్చినవారికి రెండవభాష నేర్చుట కొంత తేలిక యగుంగాని దేశీయాదులు పరిశ్రమచేయక పట్టువడుట కల్ల. అయ్యెడుతమని, "బుడిగ్గి శబ్దస్యకోవార్థః" "నీతలపేనుగంటి," "అర్జునాపాలిసితంచు నేసిన," "బాడిదలపనివారిఁగుంపటులఁగాల్ప," మొదలైన వాఁడుక లూరకపుట్టినవా.

కవిజీవితములలో 1. అల్లసాని పెద్దనార్యుని మనుచరిత్రము, 2. నందితిమ్మనార్యుని పారిజాతాపహరణము, 3. తెనాలి రామకృష్ణుని పాండురంగక్షేత్రమాహాత్మ్యము, 4. శ్రీనాథమహాకవిగ్రంథములుఁ బంచకావ్యములుగాఁ గనఁబడుచున్నవి. అందే, " ఈకవి (శ్రీనాథుఁడు) రచియించినగ్రంథములు పెక్కులు, అందు శృంగారనైషధమును భీమఖండకాశీఖండములును గావ్యపాకమున నొప్పియుండును. అందు రెండును రెండుకావ్యములుగాఁ బరిగణింపఁబడును. మఱి కొందఱవలన శృంగారనైషధకాశీఖండములు మాత్రమే కావ్యములుగా లెక్కింపఁబడును." అని తెల్పి యందలి రెండవపక్షము నవలంబించి 4-5 కావ్యములను శృంగారనైషధకాశీఖండము లని తెల్పఁబడినది. ఈక్రమమును బట్టి మనుచరిత్రము తర్వాతఁ బారిజాతాపహరణము రెండవకావ్యముగాఁ జదువుటకుఁ జాలినంతపటుత్వము కలది కాదని నాతలంపు. తాఱుమాఱు చేయవలయును. ఈరెంటి వెనుకఁ బాండురంగక్షేత్రమాహాత్మ్యమును, దాని వెనుక కాశీఖండమో శృంగారనైషధమో పఠించుటయు భాషాసౌధము నెక్కఁబోవు విద్యార్థులకు సరి

మైన మెట్లుగాఁ దోఁపవు. ఈవరుసయే యిపుడు సరిగా లే దని తలంచునపుడు కవిజీవితములలో వేఱొకతావునఁ జెప్పఁబడినటులు "లేదా ప్రారంభమునందే కాళిదాసకృత మగు కావ్యత్రయము నభ్యసించునట్లుగా నీశ్రీనాథుని కావ్య త్రయముం జదివినపిమ్మటనే, మనుచరిత్రము, పారిజాతాపహరణము, పాండు రంగక్షేత్రమాహాత్మ్యమును జదువవచ్చును. అది పాఠకుల దార్ఢ్యముం బట్టియు నుపాధ్యాయుల ప్రాగల్భ్యముం బట్టియు నుండును" అనువాక్యము మన కెట్లు ప్రస్తుతకాలముంబట్టి సరిపడును. పిల్లవానిం గూర్చుండఁబెట్టి, లేవఁదీసి, నడిపించి, పరుగెత్తించి శక్తిసామర్థ్యములు తెలిసికొని యపుడు దుమికించుట లెస్స. కాని, ముందుఁ గుదఁబడునట్లు నేలఁగొట్టి, పరుగెత్తు మని మొత్తి, నడిపించుచు నీడ్చి యారీతి నొనర్చుట యుక్తము కాదు. అభ్యాసమున కభిరుచి పుట్టింపవలయును.

నేను జెప్పఁబోవు నాంధ్రపంచకావ్యము లేవి యన:— మొదటిది యల్లసాని పెద్దనార్యుని మనుచరిత్రమే, రెండవది రామరాజభూషణుని వసుచరిత్రము. మూఁడవది పింగళసూరనార్యుని రాఘవపాండవీయము. నాల్గవది శ్రీనాథుని శృంగారనైషధము. ఐదవది శ్రీకృష్ణదేవరాయల యాముక్తమాల్యద యను నామాంతరము గల విష్ణుచిత్తీయము. వీనియందలి కథాచమత్కారము.

మనుచరిత్రము— ఇందు మార్కండేయపురాణమునుండి కొంతకథను సంగ్రహించి యాంధ్రకవితాపితామహుఁడు తననేర్పంతయుఁ జూపి రచియించి నాఁడు. మనుచరిత్రం బందుకొని పురం బేగింపఁ బల్లకిఁ దనచేతఁ బట్టి కృష్ణరాయం డెత్తెను. ఇంచుమించు మార్కండేయపురాణములోని అఱయాశ్వాసము కథ, ఆఱాశ్వాసములుగాఁ బెరిఁగినది. అఱ, ఆఱాశ్వాసములైన నిందు వృద్ధియో గుణమో లేదా!

వసుచరిత్రము— భారతములోని యాదిపర్వమునందలి యెచ్చుతకుఱవ యాఱుమొకఱలు, లేక, యాఱుమాటలను గొని యాఱాశ్వాసములుగఁ బుష్టిచేసి రామరాజభూషణుఁడు, "అవారితసత్కవికల్పనావిభూషావహ పూర్వవృత్తము లు సానలఁదీరిన జాతిరత్నము ల్గావున నిట్టి మిశ్రకథగా హృద్యముగా నొనరించి నాఁడు. మనుచరిత్రమునందు కంటె నిందు వర్ణనాచమత్కార మెక్కుడు. శ్రీరామక్షితిపుని .....జయశ్రీలలోలు నానాకళాపారీణుని బహుసంస్కృతాంధ్రకృతుల నెమ్మెప్పించి తత్కారుణ్యంబున 'రత్నహారహయ వేదండాగ్రహారాది సత్కా రంబది పిమ్మట రాటుదీరినప్రజ్ఞతో నీకావ్యమును గవి రచియించెను. రామ

రాజును భూషించినకతన నితఁడు రామరాజభూషణుఁ డయ్యెనో రామరాజు భూషణాదులచే సత్కరించినకతన రామరాజభూషణకవి యయ్యెనో రామభూషణకవి రాజాదృతిని రామరాజభూషణకవియయ్యె నో రాజకవి యెట్లయ్యెనో శబ్దవిదులు చమత్కరింపఁదగును.

రాఘవపాండవీయము—పింగళి సూరనార్యుఁ డగస్త్యాంశజుఁడు, సపాద లక్షగ్రంథ మగుమహాభారత మనురత్నాకరమును పాదలక్షగ్రంథ మగురామాయణమహోదధిని నాలుగుగ్రుక్కలుగాఁ గొనినమహిమవంతుఁడు. రెండర్థంబులపద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబు గాకుండుం దద్గతిఁ గావ్యమెల్ల నగునే నోహోయనం జేయదే, పాండిత్యంబున నందునుం దెనుఁగుఁగబ్బంబు, అద్భుతము గదా! రామరాజభూషణుఁడు బాలసరస్వతి మున్నగువారు రాఘవ పాండవీయము నెదుటఁబడినపుడు పింగళిసూరన్నలు కాలేకపోయిరి. ఇట్టిగ్రంథము నందలి చమత్కారమును వేఱుగఁ జెప్పవలయునా,

శృంగారనైషధము—ఇందలికథాంశము భారతములోని నలోపాఖ్యానమునందలి లేశము. శ్రీనాథుఁడు క్రొత్తత్రోవఁ ద్రొక్కినాఁడు. తాను స్వకపోలకల్పనము గావింపక యొకసంస్కృతమహాకవిరచియించిన యుత్కృష్టకావ్యమును గ్రహించి తెనిఁగించి తనగీర్వాణమును స్వాతంత్ర్యమును జూపుచు నాంధ్రులకు మహానందముం గలిగించినవాఁడు. శ్రీనాథమహాకవి యనౌచిత్యంబుఁ బరిహరించునపుడు, నౌచిత్యం బాదరించునపుడు, మూలాతిక్రమణమున బండితులను మోసపుచ్చునపుడును, స్వతంత్రించెను. భట్టహర్షుని మూలకావ్యమునకుఁ గావ్యదోషశంకవలనంబుట్టిన యపయశస్సునుబట్టి యేదూఱును నిందుఁ దూఱకుండఁ గాపాడిన కవి శ్రీనాథుఁడు. సంస్కృతనైషధ మిరువదిసర్గములకుఁ బైఁగా నున్నను దమయంతీవివాహముతో ముగిసినది. అట్టివర్ణనాధిక్యముగల దాని నీతెనుఁగులో నెనిమిదిబ్రహ్మాండములైన యాశ్వాసములుగాఁ జేసినాఁడు.

విష్ణుచిత్తీయము—(ఆముక్తమాల్యద)— ఇది యొక వింతపుస్తకము. రామాయణము గాదు, భారతము గాదు. ఒకపురాణము గాదు. వైష్ణవభక్తులవృత్తాంతమూలమున దేవమానుషచర్యలు, వీరవైష్ణవము, వీరశైవమును నిట్టతాడు వంటతీవకుఁ జీరచించిచ్చినట్లు యమ్మదాసర్లకు నయ్యి జంగాలకుఁ బెట్టినకథలతో నింపి యూసరవెల్లిరంగులవలె మార్చుచుఁ బెటుకు పెటు కని నిరసించు విద్వాంసు లెంద ఱున్నను మేలుబళీ దేశభాషలందుఁ దెలుఁగు లెస్స యను

మాట మిన్నుముట్ట నద్భుతాద్భుతకావ్యముగ షడాశ్వాసపరిమితిని విరచించిన కృష్ణదేవరాయ లున్నచో నేసమయములోనో మహామహోపాధ్యాయబిరుదము నిప్పించుటకు మీరు ప్రయత్నింపకుందురా! ఇక్కడి ప్రభువుగాన ధనమక్కఱ లేదు. నాలుగక్షరములపై నాయనకాన గలదు.

విద్యార్థికిం గ్రోంతికిం గొబ్బరకాయ వలెదొరకినం బ్రయోజనమేమి? ఆంధ్రకాళిదా సని పిలువందగు నని చెప్పంగొనంబడు శ్రీనాథుని మూండుకావ్యములును గాళిదాసత్రయమువలెం బ్రారంభించుట యనర్థము. కాళిదాసత్రయమువలె శ్రీనాథత్రయము ప్రారంభములోం జదువుట కంతమార్దవముకలది కాదు. ఎక్కుడ మాకు సందేహమో యక్కడనే వ్యాఖ్యాతకును సందేహము గల్గించు లఘుటీక గలపాండురంగమాహాత్మ్యము కుక్కతోంక గోదావరిం దఱించుట కెంతసహకారియో యంతటి సహకారియగును. నేను జెప్పిన యైదుకావ్యములకు 1-2-3-5 గ్రంథములకుం డీకాతాత్పర్యము లున్నవి. నాల్గవదానికి వ్యాఖ్యానమే యున్నది. ఇవుడు పెద్దలకటాక్ష మించుకంత ప్రసరించిన విద్యార్థి కన్నుదెఱచుట కొక్కింత శక్తికలుగును. దైవవశమున నట్లు పడినవో లేక కవులే యుద్దేశించి వ్రాసినారో గాని నాపంచకావ్యములు కావలసిన ట్లున్నవి. నే నాంధ్రకవితాపితామహుండ నని కాని, సాహిత్యరసపోషణుండ నని కాని, సూరిలోకాంగీకార తరంగితకవిత్వవైభవుండ నని కాని, బ్రాహ్మీదత్తవరప్రసాదుండ నని కాని, ఆంధ్రనాయకప్రసాదాతిశయపాండిత్యమండితుండ నని కాని, విఱ్ఱవీఁగి వచించుట కాదు. నాయుక్తికి నాయూహకుం దోంచినట్లు నాపంచకావ్యముల తారతమ్యముం జెప్పంబోవు నన్ను మన్నించి యాలింపం బ్రార్థించెదను.

మనుచరిత్రము—విద్యార్థులు దీనిని మొట్టమొదటం జదువవలయును. లాభ మేమనంగా:- సర్వసాధారణముగా భాషాభ్యాసమున కిది మొదటి మెట్టుగా నున్నది. అటం జని కాంచె భూమిసురుండు లోనివంటి యేకసమానపద్యము లెన్నో లేవు. పచ్చనిపంజుమంజవనివాగెపక్కఱ పద్యములవంటి యన్యదేశపదపద్యములు పెక్కులు లేవు. శ్రీరుచిరత్వభూతిమతిజిత్వరతాది కలంత పుట్టించు పద్యములు తక్కువ. ఓయి దయావిహీనమతి యూరక యీపసిబిడ్డ గొట్టంగాం జేయెటులాడె నీకు నిది చేసిన దేమి వృథా శపింతురే బోయవె యేండుందోడు నను బుట్టవె ఇత్యాది మృదుపదశతపద్యములతో నరంటిపండిచ్చి పిల్లవానిచే బాఠములు చదివించినటులు చేయూంత యిచ్చి బెదరింపక, గారాపుమీఁతల్లి

కడవాఁడఁ గాని నే గణుతింపఁ గడవాఁడఁ గాఁజూమయ్య. పెండ్లికొడుకవు మాకు నిచ్చినరుహాక్షి కూర్మినందన, యని యపుడపుడు తీయనిపలుకుల నానగొల్పి యానందరసమున నోలార్చి "సాలోక్యము తుదినిచ్చెద నేలు మిల ద్వితీయ మను వవై" యని యాశీర్వదించును. దీనిం జదివినయెడల ననేకము లగుసంస్కృతాంధ్రపదములు (వేనవేలు) మాటకొక్కయర్థము మాత్రమే కలపి పట్టువడును. మాటలాడుట కన్ని తెలుఁగుల మాటలు నుండవలయును. అప్పుడు గదా యే దైన వ్యవహారమునకో, యుద్యోగమునకో, వినోదప్రసంగమునకో యనువగును ఇంకు సంసారవిషయము లగుపలువితములమాటలు, రాజ్యము, తపస్సు, వేఁట, యడవి, పెండ్లి, మృగములు, పక్షులు, కొండలు, చెట్టుచేమలు, తడవుకొన కుండఁ బరేంగితముం దెలిసికొనుటకు నితరులకు స్వాభిప్రాయముం దెల్పుటకుఁ జాలినన్ని శబ్దములు సంపూర్ణముగ నున్నవి. తప్పులు సవరించి యనేకప్రతులతో సంప్రతించి దీనికి మంచిప్రతి యచ్చువేయింపవలయును. నామిత్రులయొద్ద నున్న యొకప్రతిలో నెన్నో మనము వినని క్రొత్తపద్యము లున్నవి. దీనివలన మాట లు నేర్చి వసుచరిత్రముం జదువవలయును. మనువు దృఢమైనపిమ్మట వసువుపై నాసపుట్టును.

వసుచరిత్రము—పెక్కుమాటలు తెలిసికొన్నపిమ్మట వాని నుపయోగించుటకు స్వతంత్రశక్తిని వినియోగించువిధాన మిందుఁ గలదు. మాటలు తెలిసినంతనే కాదు. వానిని జమత్కారముగ నుపయోగించుట నేర్వవలయును. పదముల పొందిక, యుక్తులు, నుచితానుచితములు, వాక్యచమత్కారము నేర్పుచు నొక్కొక్కమాటను వేఁలువేలువిధములుగా మార్చి పలుకుట తెల్పును. మునులిమానుల కిఱిచి గిరికానన ములరించును. బాలునకు మాటలు వచ్చును. అన్నము తినుటకు నీళ్లుపోసికొని రమ్మనిన వాని కర్థమగును. అన్నమునకు నీళ్లుపోసికొ మ్మనిన నర్థములోనిమెలఁకువ గ్రహింపలేఁడు. బండి మీఁద నెక్కి చెందు ర్తివెళ్లు మనినఁ దెలిసికొనును. బండి మీఁదనెక్కిన నేయూరు వెళ్లెద వనిన గ్రహింపలేఁడు. మనుచరిత్రము చదివినవాఁడు వసుచరిత్రము చదివిన నిట్టి మెలఁకువలు గ్రహించుపెద్దబాలునివంటివాఁ డగును.

ఒకచాయ ననపాయపికగేయసముదాయ మొకసీమ నానామయూరనినదము
లలనాజనాపాంగవలనావసదనంగతులనాభికాభంగదోఃప్రసంగము...
కన్నెపాదము లజుగన్నమేటికి నైన శాలజంఘులు వరశాలినైన...

అచటిసానులు రత్నరుచిరంబు లననేల వానివంశము లెల్ల నీను మణుల...
నిలువెల్ల నీచాతినీచోపసరణంబు ప్రకృతియెల్లను జాడ్యపరిణతంబు...
రూపుఁ గన్నారఁగఁ జూచివచ్చితి నవాంబురుహాంబక నీకుఁ దెల్పఁగన్.
తలిరుఁబ్రాయమువాని వలరాజు నలరాజు నలరాజుఁ దెగడుసోయగమువాని.

ఇత్యాదిగా ముందు నేర్చిన పదములనే విడిచియు నతికియు మంజువాణీ విలాసనంపదల, భాషాశిశువును— జలకములార్చి పాండుజలజచ్ఛదపాళిక గప్పి తమ్మిసంకులఁ దెలితేనెయుగ్గులిడి క్రొందరఁగల్గదలించు కల్వతొట్టెల ......... ఘటించి పెంచి యొకరసికునివశము గావించి యానందముగ నిర్భయముగ నుండు మని లాలించి విడిచియుండఁ గొంకునపుడు—

ఉ. తమ్ములఁ బంపుదు న్మణిశతమ్ములఁ బంపుదు రాజహంసపో
తమ్ములఁ బంపుదుం బరిచితమ్ములఁ గానన దేవతాళిజా
తమ్ములఁ బంపుదున్ ద్రుతగతమ్ముల నేనును సారణీప్రపా
తమ్ములవత్తు విశ్వవిదితా ముదితా మదితాప మేటికిన్. అని యోదార్చును.

ముఖ్యకథలో నడుమనడుమ నప్రకృతార్థమిషంబున శబ్దముల విశేషార్థ ములు రుచిచూపును. వెనుక నేర్చికొనిన పదములను బునరవలోకమున మెఱుఁ గువెట్టుటయే యిందు విద్యార్థులు చేయవలసిన పని. పదముల కర్థాంతరము లొక్కుమ్మడినే నేరుప మొదలిడి మతిభ్రమణము చేయకుండ—

విదితౌతనుమంత్రజాలు నిమ్మునిఁ గొనియాడశక్యమె......ఇతండు మాకుఁ బరమాప్తుఁడు గాక మునీంద్రమాత్రుఁడే!" యనురీతి నుచితగతి నందందు మెలఁకువగ మాటలాడనేర్పును. ప్రపంచజ్ఞానము సంపాదించినకొలఁది రామరాజభూషణుఁ డిందు సంగీతసాహిత్యములు రెండును మేళవించినాఁ డని నేర్పరులవలనఁ దెలిసికొనఁగలము. బ్ర॥ కట్టా పాపయ్యశాస్త్రిగారు, సత్యవోలు సోమసుందర రావుగారు మున్నగువా రాయావిధము లగురాగాలాపముల కెడముగలుగు పద్దెములను జదువుట వినిన విద్యార్థుల కనుభవమే. కొందఱవలెఁ బృథుకాక్షరంబులు గురుశ్రీవర్ణతుల్యంబులై " యనుచో " క " యనునక్షరములు " శ్రీ " యనువర్ణమునకుఁ దుల్యములా యని పెడయర్థములు చేయుట నేర్చుకొని విరసులు కాఁగూడ దని మీరు విద్యార్థులను మందలింపఁదగు. ఇట్టి వసుచరిత్ర ములోని పద్యము లన్నియుఁ బ్రతిపద్యరసాస్పదము లని తెలిసికొన్న విద్యార్థులు కీర్తిశేషు లైన చిత్రావధానులగు వేంకటనారాయణశాస్త్రిగారి పుస్తకములో

నుండియు నచ్చుప్రతిలోని కొక్కని 100 పద్యము లెట్లుండునో యని నోట వ్రేలి డికొని మిన్నుచూడకపోరు. చచ్చి స్వర్గమునందున్న యాశాస్త్రిగా రబద్ధము లాడి యుండరుగదా. వారితమ్ము లిపుడు కాకినాడలో నున్నారు. వారి యొద్దనున్న దేమో యాపుస్తకమునకై విద్వాంసులు యత్నింతురుగాక. ఈగ్రంథ మంతరసా స్పదమైనదికావుననే సంస్కృతకవులు దీనిని భాషాంతరీకరించి యున్నారు. వసు సంపదయున్నపుడు రామా, కృష్ణా యన బుద్ధిపుట్టిన సొగసు.

రాఘవపాండవీయము—మనుచరిత్రమును వసుచరిత్రమును గట్టిగఁ జది వినపిమ్మట రాఘవపాండవీయమును జదువవలయును. వసుచరిత్రములోఁ బలుగ పాటుగఁ బ్రకృతాప్రకృతార్థముల నిమిడ్చెను. ఇందు రెండర్థములుఁ గడవెళ్ల వచ్చునట్లును రెండర్థములును బ్రకృతములే యగునట్లు నిదివఱకు నేర్చిన శబ్దజా లముతోనే శ్లేషలు విఱువులు గనఁబఱిచి యతినిపుణముగ రచించినాఁడు.

పాండురాజయశమెన్నవై తతిక్రూరదశరథేశకులమురోయ
ఎనయక లోకగురుప్రశస్తిగల నీయిల్లాలనై కాంతవ
ర్తనలం బర్వుచు నుర్విమానవతులక ధన్యస్థితి న్మించియు
ప్పిన నన్నర్థమె యిట్లనందనులయాభీలార్తి పాల్సేత పావనమానీశ్వర...
ఏనుంగని కరమరయక, పూనితిఁగా కిట్టిమెడలఁ బొసఁగునె... [దు.
అంత రారమ్ము మనుజపయజ్ఞఫలము నొసఁగెదఁ గొను మని విభావసూద్భవుం
అనుపమప్రౌఢిమంబది దినములైదు, రెండునొంచువిఘ్నంబు లేకుండజరిగె.

ఇట్టి తేలికమాటలతోనే యర్థచమత్కృతిని సూరనార్యునివలన "దేవరప్రేరణం బునన యుద్దీపించు వాగ్వైభవ శ్రీవిస్ఫూర్తిని రామభారతకథాశ్లేషప్రబంధో త్తమవ్యావిర్భావము నిట్లుసెందె. దీనిలోఁ గొన్నింటికిఁ బెద్దలు భాగవతార్థముం జెప్పుదు రని వింటుము.

కాళిదాసత్రయముం జదివిన ట్లీ మూఁడుగ్రంథములం జదివినవారి కేదేని విద్వద్వర్య లోకపరీక్షకొనర్చి బిరుద మొసంగి మిగిలిన రెండుకావ్యములం జదువుట కొకింత ప్రోత్సాహముం గలిగించుట యుక్తము. ఇకావ్యత్రయ ముతో జరగనివారు చదువు చాలించి పొట్టకై వెదకికొనినను గొంత సంతుష్టి యుండును. అట్టివారి యత్నము "ఘట్టుఘారము" దాఁకఁ జదివినాఁడ నని యుద్యోగమునకై వెదకు విద్యార్థి యత్నమువలె హాస్యాస్పదము కాదు. ఏపాఠ శాలయందైన నుపాధ్యాయులుగ నియమింపఁబడవచ్చును. ఉన్నతపాఠశాల

లలో నిపు డింతటి చదువు చాలును. సంస్కృతకావ్యములలో "భారవేరర్థగౌరవ" మ్మని యర్థగౌరవముంబట్టి కిరాతార్జునీయముం జెప్పిన ట్లీయాంధ్రమున వసుచరిత్రము రాఘవపాండవీయము లోకదానికంటె నొకటి యర్థగౌరవమునం గ్రమక్రమాభివృద్ధింగాంచినవి కావున నీరెంటిని దప్పక చదివింపవలయును. రామకృష్ణప్రభావమునఁ గలిదోష మడఁగును.

శృంగారనైషధము — ఈవిద్వదౌషధమునఁ గలిదోష మడఁగునట్లు శ్రీనాథమహాకవి రచించెను. ఇందు మనుచరిత్రములోని పద్యములవంటి పద్యములు, వసుచరిత్రములోని పద్యములవంటి పద్యములు, రాఘవపాండవీయములోని పద్యములవంటి పద్యములు నంతకంటెఁ జిత్రములైన పద్యములు నున్నవి. ఇది చదువునప్పటికి విద్యార్థి కెక్కుడుశ్రద్ధ కావలయును. క్రొత్తక్రొత్తమాటలు నవనవార్థములుఁ గల్పనలును బెద్దపెద్దభావములుం గలవు. సంస్కృతపదములు వెనుకటి మూఁడుగ్రంథములలో కంటె నితరమైనవి కలవు. వర్ణనలు విశేషములు. ఇదివఱకు నడుమనడుమఁ దగులు సంశయముల కిందుఁ దీర్పు లున్నవి. లోకాచారములు, వైద్యము, వ్యాకరణము, జ్యోతిషము, భరతము, భూగోళము, నీతిశాస్త్రము లలోనిప్రసంగము లాయాస్థలముల సందర్భానుసారమునఁ జొన్పఁబడినవి. విద్యార్థి యాయాపట్టుల మూలకథతోపాటు వానినిగూడ నేర్చికొనుటకుఁ గొంత కాలము వినియోగింపవలయును.

"పేరునుగం దలంచెదవు భీమతనూజ...ఎవ్వరికి దోసము ౘాఁ దనపేరుచెప్పుటాచారవివేకహీనుఁడగు జాల్మని మెత్తురె.........

"పణినాపత్యోక్తశాస్త్రమ్ములో తాతజ్స్థానులు చెప్పఁ డెవ్వియను చందం బొప్పఁ గాకులు కాకాయనన్. "ఉత్తరము విస్పష్టంబుగాఁ గోకిలవ్రాతం బిచ్చెఁ దు హీ తు హీ యని"

"అస్తివాహ్యభార మస్తికౌతూహలం బస్తిఘర్మసలిలము"

"పామునకు బలివెట్టని ప్రతినవారు, నీఁగ కెన్నఁడు నే నిలియిడనివారు ధనము గాపున్న దయ్యాలఁ దఱుమువారు

"జినగవేషణనిరతుఁ డాచెట్టనూచు, నభినవబ్రహ్మచారిచయాజినంబు.

"భాండికమండలీప్రకృతబంధుఁడు"

"తనజనకుఁడు శౌరిసుద, ర్శనచక్రమునను జయించె జగమని మరుఁడీ వనితయుదర్శనకటితట, ఘనచక్రమునం జయింపఁగాఁ దలఁచెఁజుమీ,

ఈరీతి, రత్నాకరములోనుండి నే నెన్ని మెఱుఁగులు చూపింపఁగలను
అవగాహనముచేసి యోపికపట్టి వెదకినవానికి నవరత్నములు దొరకును. నామాటల
తోనే తృప్తినొందఁ దలఁచువారిని మొండితేలుగుట్టును. ఇట్టిగ్రంథముం గావిం
చిన మహాకవికిఁ గనకాభిషేకము సేయవచ్చును. మొదటిమూఁడుకావ్యములం
జదువకుండఁ దీనినే చదువఁదలఁచుట తొందరపాటు. కలిహార మైనవిమ్మట విష్ణు
చిత్తీయము కడపటిది.

విష్ణుచిత్తీయము—దీనిం గూర్చి యెంత చెప్పినను జెప్పఁదలఁచిన విషయ
మేదో మిగిలియే యుండును. మీకుఁదృప్తియగునట్లు నేను జెప్పలేను. పైనాల్గు
కావ్యములలో లేనిపదములు, వర్ణనలు, కల్పనములు, విషయములు, పనిగట్టి
వేసినట్లున్నవి. "అయంవిశేష" యనినట్లు దీనియందు విశిష్టాద్వైతసిద్ధాంతము
ముఖ్యము. రాజుదలఁచిన దెబ్బలకుఁ గొదవయేమి. విద్వన్మండలితో నవవర
తము మెలంగు నీకవిరాజునకుఁ జేయవలయునన్న నెంతటిగొప్పపనియును గోటి
తుదనుండును. శ్రుతపాండిత్యమే యొక్కొక్కరికి విశేషప్రపంచానుభవముం
గలిగించి యాదరముం గాంచును. ఎన్నఁడు నెవ్వరుఁ ద్రొక్కని దారులు, నెవ్వ
రుఁ గల్పింపని కల్పనలు, నెవ్వరికిఁ దోఁపని తలంపులు, నెవ్వరు నంటక విడిచిన
పదములును వెదకి వెదకి శ్రుతికటు వని దుర్గ్రాహ్యమని నియమవిరుద్ధ మని
యెన్నక ప్రశ్నించుటయు సమాధానమువచ్చుటయు నే ముఖ్యముగ విద్యార్థుల
నుత్కటప్రజ్ఞావంతులం జేయఁగోరి తా నతికష్టపడి దీనిని రచించి యుండును.
ఇన్ని క్రొత్తసంస్కృతపదము లున్నవని యిన్ని తెనుఁగుపదము లున్నవని యేవా
రును దెలిసికొనలేరు. మాయొద్ద నీరీతిశబ్దము లిన్నివంద లున్నవి. నేనిన్నిపద
ముల సంగ్రహించితి ననువా రీగ్రంథమును జక్కఁగాఁజదివి యున్నయెడల
నెన్నియో పారివిశంగాయగములు, పెందిరువడిసమాసములు వారిపట్టికకుఁ జేరి
యుండును. క్రొత్తవ్యాకరణము వ్రాయుచున్న మహాత్ములు లోహండీకావళ్ల నేస
మాసములోఁ జేర్చిరో కనుఁగొనవలయును. ఇందును సాధారణపద్యములు,
శ్లేషలు, ద్వ్యర్థులు, గలపద్యములు మితిలేకయున్నవి. నాలుగుకావ్యములు చదివి
వినా మని యహంభావమునఁ జదువువారి కిది కొఱకఁబడదు. "పూని ముకుందు
నాజ్ఞ కనుబొమ్మనె గాంచి యజాండభాండము ల్వానను" ఇప్పద్యమున కివు
డచ్చుపుస్తకములోనున్న యర్థము తాత్పర్యము సహాయమున నాత్మానుభవ
మగున ట్లర్థముచేసికొనఁ గలుగువిద్యార్థులు నూటి కొక్కరుందురు. వారికైనను

జేపాటికట్టరయో పేపబెత్తమో ప్రచ్ఛన్నకుండఁ దెలిపినబోధయేకాదు. ఇందలి పద్యములిట్టివి యని యందిచ్చుటకు గ్రంథవిస్తరభీతి మెండుగా నున్నది.

"పిడుగుల కల్కి లోఁదొలిచి భీరులు కంచముచల్లు దీధితుల్...

వెలివాడలోఁ గ్రొత్తమలకవాల్గోని నూనెయిడి తంగెడాకుఁజుట్టైన తహతహ

మృతమర్త్య రొటాన నిడ్డఁజాలక నెత్తు రంజల్లు పెనుపొట్ట ముంజెవాని...

ఎలనీటిబొండలంబులు పోలె మెదడెల్ల జుట్టవై చిన డొల్లుపుట్టగములు...

ఇట్టి వెన్ని యగ్రహారములిచ్చి, కవితాపట్టాభిషిక్తుం జేసి, నిరుపహతిస్థలము, కప్పురవిడెము, ఉయ్యాలమంచ మిచ్చి చెప్పినట్లు వ్రాయ వ్రాఁతకాండ్ర నిచ్చి యూహ దెలియంగల లేఖపాఠకోత్తముల నిచ్చి నను మఱియొకఁడు వ్రాయుసమర్థుఁ డుండు నని నే నూహింపను. ఇంకఁ బిడుగుకుఁ పద్యములున్నవి. మీఁగడలజిడ్డెఁగించెడు కమ్మగాడ్పు పద్యము లున్నవి. అగపలముంచిపెట్టు కలమాన్నపుఁ బద్దెము లున్నవి. చేచుఱుకగు నునేయి, మేకపువుకుంపట్లు, సమస్తమును గలవు. ఇది యొక నిఘంటువు లేక భాషాసర్వస్వము. దీనితోఁ బంచకావ్యములు పూర్తియగును.

ఈపంచకావ్యములకుఁ బ్రస్తుతమున నున్న టీకాదులవివరము:—

మనుచరిత్రము—మూఁడచ్చుప్రతులున్నవి. ఒకటవది గుజిలీప్రతి, తప్పులతడిక, రెండవదానిలోఁ గొన్నిపద్యములయర్థములు వ్రాయ లేదు. మూఁడవది యొక్కింత చూపునకు రమ్యముగా నున్నది. ఉపోద్ఘాతము, కథాదివిమర్శనము లున్నవి గాని విద్యార్థికిఁ బ్రథమకావ్యముగాఁ జదువఁ బోయిన నించుకంతయు సహాయము చేయదు. నాయభిప్రాయమునఁ బ్రథమకావ్యమునఁ జక్కఁగ సంధులు, సమాసములు, విభజించి తెలుపుటయుఁ (ప్రథమపత్త్రము వెంకయ్యవ్యాకరణములోని సంజ్ఞా, సంధి పరిచ్ఛేదము లయిన) ప్రస్తావవశమునఁ దత్తత్స్థలముల సూత్రములు చూపించి యామూలమునఁ గొంతవ్యాకరణజ్ఞానము కూడఁ గలిగించునది గా నుండవలయును. ప్రతిపద్యమునకు, సులభతాత్పర్య ముఁడవలయును. రాముఁడు—ఏకవచనము, రాములు—బహువచనము, గాన (హరి-హరులు) అది ఏకవచనము, అదులు బహువచన మనుకొనకుండ నైనఁ జేయవలయును. ఏదియు లేకుండ, శ్రీవత్సోజకురంగనాభ మనుపద్యములో నలంకారము, భ్రాంతిమదలంకారము, వస్తూత్ప్రేక్ష, రెంటికి సంకరము. విరూపకార్యోత్పత్తిచే విషమాలంకారము. వ్రేళ్ల కాంతి యెఱుపును బొందె ననుటచేఁ దద్గుణము. ఇట్టి

వేవిద్యార్థి చెవికెక్కును! పోనిం డాయలంకారముల లక్షణము లేవి? ఇది తెనుఁగు పదము, నిది సంస్కృతము : ఇది యుకారసంధి, తద్భవ, మిది, తత్సమ మిది, మొదలైనవి సరళపరుషమార్గముల స్థిరజ్ఞానము కల్గురీతిం దెలుపవలయును, చిన్న చిన్న నిఘంటువులు తెల్పుట మేలు. ఏమియు లేనికతన మాశిష్టము లేని యాటీకలు విద్యార్థుల కుపకరింపవు. ప్రపంచజ్ఞానము కలవారికై యవి యుండుఁగాక. మాకు వ్యాఖ్యానములు గూడఁ గావలయును. ఒక్కపుస్తకము టీకలోను, ఆశ్వాసమున కొక్క సంధిసూత్రమును బందెమునకు లేదు. కేదారేశుభజించు చోట మాకు భూగోళమో దేశచరిత్రమో కావలయును. హింగుళాపాదాంభోరుహముల సేవించునపు డీయమ్మ యేదేవునిభార్యయో మాకుఁ దెల్పకున్న మాకు భక్తి యెట్లు స్థిరపడును.

వసుచరిత్రము—మనుచరిత్రముటీకలను బోలియున్న రెండుటీకలు దీనికిఁ గలవు. ఒక్కసంధిగుణము కనఁబడకుండుట వైద్యశాస్త్రప్రకారము మేలుగా నున్నది. ఇందులో మంజీరాగ్రరత్నము నెట్లు భేదింపవలయునో యెట్లు సంధింపవలయునో తెలిసికొను మార్గము కాసిపాడితులకుఁ దెలియునేమో మాకుఁ దోఁప లేదు. వసుచరిత్రములో నుకారమునకైన సంధి యెట్లో విద్యార్థి నేర్చుకొనుటకును దగఁడా. ముందటిపద్యములో నన్వయమే కాని యన్వయమన నేమో తెల్పను. వెంకయ్య వ్యాకరణములోని పంచపరిచ్ఛేదములలోని సూత్రము లైన రాకుండ నడ్డుపెట్టు టీకలు మావిద్యార్థులకు బధిరశంఖారావములు. “ఈపద్యము ద్విప్రాసము గలదిగాఁ జెప్పఁబడియె.” యతి యన నేమో ప్రాస మన నేమో యెఱుఁగని మాకు ద్విప్రాస మేల. ఛందస్సుకూడఁ గొంచె మిందుఁ గనఁబడవలయును. ఆశ్వాసాంత్యభిన్నవృత్తముల కైన లక్షణము లేదు. ఏపుస్తకములలోను బద్యలక్షణములు లేవు. కొన్నింటికిఁ దాత్పర్యములు లేవు. అర్థమన నేమో, తాత్పర్య మన నేమో, భావ మన నేమో వివరించిన పిమ్మట “అనిభావము” అని వ్రాయుట లెస్స. “యమునా సరస్వతులనుగా నుత్ప్రేక్షించినాఁడు” ఉత్ప్రేక్షకు శబ్దార్థమైన వ్రాయఁజనదా. “కలికి యొప్పిదంబు కాంతమయ్యె” నని నిఘంటు వఁట! “దీనం గాంతియను కావ్యగుణము చెప్పఁబడినది.” గుణదోషవిభాగ మోనమాలురాని వారికేల. “క్షితిరూపాభూపుత్రీ” క్షితిభూపుత్రి. రాఘవత్వే భవత్సీతా రుక్మిణీకృష్ణజన్మని” ఇది మొదటిపద్యటీకలోని యారంభశూరత్వము. రెండుమూఁడుపద్యములనుండి యిట్టిసంస్కృతపదములైన

మందునకుఁ గానరావు. “ లంకాయుపిచ్చికొండ ”పద్యార్థము లిందు బహుళము. ముక్తస్యముక్తార్థములు పెక్కులు. దీనికి మంచివ్యాఖ్యాన మొకటి దయచేయఁగోరెదను.

రాఘవపాండవీయము—ఇపుడు దీని మొగము (ముఖపత్రము) నైనఁ జూచుచున్నవారు కనఁబడరు. అంగళ్లలోనిప్రతి జననీజనకులన నెవ్వరో యెఱుఁగని యజ్ఞానమున నున్నది. చదివిన నేమియుఁ దెలియదు. సంతమెఱుఁగు సాని మెఱుఁగు ముద్రణములోని దొకటి యంగడిప్రతిపుత్రిక. రెండవది మేఁకపోతు గాంభీర్యము చూపుచున్నది. విషయమున మాకది యనుపగుగ్గిళ్లే. “ తానన్న మాట యింద్రునకైనను ” అనుపద్యమునకు రామాయణభారతార్థములు రెండును సమముచేసినది. వ్యాచిక్రింసఁ రూపమెట్లో తెల్పదు. ఘ్రాణిక చెల్లింపుచు, ఘూర్జర, సిమ్హా, కళ్లయందలినీరు, పితరులఋణముదీర్చెదుసూను జెందని దౌర్భాగ్యశీలు గోత్రమ్ము (త్రమ్ము) లవిశేషసాధుత్వాసాధుత్వములు విచారింపదు. కారణములు సూత్రములు ముట్టదు. శ్రీవృక్షకీఘోటకములు=శ్రీవృక్షచిహ్నాచిహ్నితములైనయుత్తమాశ్వము లఁట. “ హారిమృగవ్య ” యనఁగా దశరథుఁడు హారి=హారములుగలవాఁడు, మృగవ్య = వేఁటయనవలయునఁట. పాండురాజు హారి=మనోహరమైన, మృగవ్య=వేఁటయనవలయునఁట. అట్లనకున్న దోషమేమో, అనిన నుపయోగమేమో తెల్పదు. “ నాయందుఁ గరుణ నడవఁగట్టి పగఱ నడంగించి తేవె ” యనునసముద్రునిప్రార్థనకు “ నాయందుర్ కరుణనడవర్=నాయందుఁగరుణద్వారగా, గట్టిపగఱ్=నాకుఁగలక్రూరశత్రువులను, అడంగించితివేని సిద్ధసంకల్పుఁడనగుదు ననియర్థమఁట. నాయందుఁ గరుణన్, నడవఁగట్టి=నడుచుటకు సేతువుగట్టి, పగఱగెలిచి తేని=రావణాదులజయించితివా” యనునర్థము రావలయునని విజ్ఞుల యభిప్రాయము కలదు. దానినిందు విశేషార్థముగానైన సూచింపదు. ఈగ్రంథమునందే విశేషముగ శ్లేషలు, యమకములు, చిత్రకవిత్వములు, లక్షణములు విరివిగాఁ దెల్పవలసియుండఁగా మాకంధత్వము నాపాదించుచున్నది. మాయల్పజ్ఞానముతోఁ గూడితికుండలోఁ జేబాఱలు వేసిన ప్రయోజనము కనఁబడలేదు. ఈగ్రంథములోని యొక్కవిశేషాంశము. మొదటి పద్యమునకుమాత్రము శార్దూల మని తెల్పి “సారాచారవిశారదా” యను లక్షణపద్యము నుదాహరించినది.

ఈకావ్యత్రయములో మావిద్యార్థులకు వ్యాకరణము, ఛందస్సు, అలం

కారములును బూర్ణముగఁ దెలియునట్లు మీరు యత్నింపకున్న నిష్ప్రయోజనము. మా కట్టియదృష్ట మెప్పుడు పట్టునో. వానివాని ద్వితీయముద్రణములకై పండితులకుఁ దోడ్పడుఁడని భాషాభిమానుల నిఁక మేము ప్రార్థింపవలసియున్నది.

శృంగారనైషధము— మాహిరణ్యాక్షవరము లీగ్రంథవ్యాఖ్యానములో లభించిన వనవచ్చును. రెండువ్యాఖ్యానములలో నొకటి సాకత్యంతశ్రేష్ఠముగా నున్నది. మాసందేహములం దీర్చుచున్నది. ఇంతకవిగాఁ గాకున్ననుఁ బద్ధతి యిట్లేయుండఁ బైమూఁటికిని వ్యాఖ్యానములు పండితు లనుగ్రహింపవలయును. టీక యనిన నిదియే. వ్యాఖ్యాన మనిన నిదియే. వేయేల! "గురువన్న ధన మనినను బుణ్యమనినన్ గోత్రోదయంబన్న దేవరయన్న న్మనమన్నఁ, దుష్టి యనినన్... వాత్సల్యమన్నన్......బరమోపకారమనినన్ సర్వంబు నన్న" న్నాకిదియే. తాత్పర్యాది వివృతి యింతకు మించి మా కక్కఱలేదు. ఇంతకు మున్ను మూఁడుకావ్యములం జదివి యు నిట్టివ్యాఖ్యానము గలగ్రంథ ముండియు నజ్ఞానులమైన మాయదృష్టము.

ఆముక్తమాల్యద— ఈయుత్తమగ్రంథమునకును నైషధవ్యాఖ్యానము వంటి వ్యాఖ్యానమే కావలయును. ఇందు దక్షిణదేశసంప్రదాయములు మాకెక్కువ తెలియఁదగినవి గలవు. ద్వైతాద్వైతాదుల యుపన్యాస మిందొక్కింత యవసరము. గ్రంథవిషయమై యిటీవలి పీఠికాదులు కొంత కథాసందర్భమును బోధించుచున్నను కొన్ని నేర్చికొనుట కితరవ్యాఖ్యాన సాహాయ్య మవసరమై యున్నది. పింగళి సూరన్న ముందా రామరాజభూషణుఁడే ముందా తెలియక మేముచదువునది చిలుకచదు వగుచున్నదిగదా!

పూర్వవ్యాఖ్యానములు పెక్కులున్నవి, పైయైదింటికిఁ బునర్ముద్రణ మపుడు వానిం దిలకించి సంస్కరించుట మేలు.

విద్వద్వరేణ్యులార! ఒక్కముఖ్యవిషయ మింకనుఁ జెప్పవలసియున్నది. ప్రతిగ్రంథములోను గృత్యాదిపద్యములంబట్టి కవులయొక్కయుఁ గృతిపతులయొక్కయుఁ జారిత్రములు, కాలనిర్ణయము దేశమును దెలిసినంతవఱకు స్పష్టముగా నుండవలయును. ఇట్టిజ్ఞానము లేకయే, మే మిప్పటికి నెందఱుచెప్పినను నెన్నిగ్రంథములలోఁ గనఁబడుచున్నను, పెద్దిభట్టుగారివ్యాఖ్యాన మనియు, కాళిదాసుగారు చల్లయోః వెల్లకుక్కయోః" అనినారనియు, "నానాసూనవితానవాసనల" పద్యము గొని రామరాజు తనపుస్తకములోఁ జేర్చికొన్నాఁడని, భీమన

పుస్తకమును గోదావరిలోఁ గలపినాఁ డని, ఆంధ్రశబ్దచింతామణి యథర్వణుని దని, తెనుఁగుభారతము నారాయణభట్టు దని, (ఇంకను దెల్పిన వెఱ్ఱిగానుండును) భల్లాకపుఁబట్టు విడువకున్నారము. ఒక్కటి మరలఁ జెప్పుచున్నందుకు మన్నించి విశ్వగుణాదర్శములోని "అప్పయగురోః" అనుదానింబట్టి అప్పయదీక్షితులు మొదట వైష్ణవుఁడే యనినమ్మటను బైదానిలోఁ జేర్పఁగోరెదను. అలకసవాపాత్రుఁడు, అల=ప్రసిద్ధుఁడైన, కసవాపాత్రుఁడు. అని ప్రసిద్ధుఁ డని కాఁబోలు వాని చరిత్రము వ్రాయకవిడుచుచున్నారు. ఎక్కడివాఁడు, చరిత్రమేమి ? సవాయిబరీదు. ఇ దేమిటి, మనుష్యునిపేరా, మసీదా, పర్వతమా ! జమ్మిలోయఁబడి, జమ్మియేమి, లోయయేమి ? నిజామాదుల్వజీరుల్-ఏనిజాము ? చంద్రగిరిమర్గంబందు శ్రీవేంకటేశ్వరుఁ డొప్పెన్. ఎప్పుడు ? కర్ణాటాంధ్రధరణీపునరుద్ధారికి-ఎట్లుద్ధరించినాఁడు ? మిశ్జంగలఖానహాలహాలత్రిపురహరా ! ఇతఁ డెక్కడివాఁడు ? "తరుణచరణభాగిభ్రామశరణ" ఎపుడు ? "హాల్యాహతజన్యజాంగలాంగణ" ఏసంవత్సరపుయుద్ధములో ? నిజామగుప్తకల్యాణహరా ! ఢిల్లీకాగధరాధాద్యరిధామధామగరిమగ్రస్తగ్రహాధీశ్వరా ! హేమకూటాశ్రయఖ్యాతబ్రహ్మము. విరూపాక్షస్వామిస్థానాదికము, మామిడిసింగన, ఆకువీటివారు మొదలగువారి వృత్తాంతము, అధమము వంశవృక్షములు లేనిదైనను జాలును.

పండితవర్యులార ! ఇందు పై విషయములు కొన్ని మీకాక్షేపములనితోఁపవచ్చును. మాకున్న లోపము లివి యని తెల్పుటయే కాని ఖండనమండనాదులుగా మన్నింపవలదు. ఎప్పు డీవిషయములు పూర్తిగా మాకు దొరకునో యప్పుడు మేము కృతార్థులము. భాషయన్న నెదురీఁదుచుఁ గరెక్కకున్న విద్యార్థుల నున్ముఖులం జేయునుపాయము లివి. మృగములను మచ్చులు చల్లి మాటు నొద్దికిఁ దేవలయుంగాని పొగపాటులు, మందుగుడ్డలతో విముఖములుగాఁ జేయరాదు. సంస్కృతకావ్యములం జెప్పు శాస్త్రులువా రం దం దున్నారు గాని యాంధ్రకావ్యములం జెప్పుటకును నియమపూర్వకవిద్యాభ్యాసము చేయుటకును, గురువులును విద్యార్థులును గఱవైరి. ఎవ్వరో కొందఱిప్పుడిప్పుడు సంస్కృతము చదువుటకు మొదలిడి శాసనములుచదువ నభ్యాసము చేయుచున్నట్లు, కొందఱు తెనుఁగు గ్రంథములం జదువ నాంధ్రేతరులు యత్నించుచున్నారు, కావున వారింగాంచి యైనఁ గొందఱును, నొకరింగాంచి మఱియొకరును భాషనేర్చికొనవలయు నని కాకున్నను జారిత్రము ముఖ్యమని యెంచియైనను, అందేమి యున్నదో యని యయినను జదువందలఁతురు. నేలవిడిచి సాముగా భాష

రాక చారిత్రమునకై వెదకువారు నేను గోరినట్టి వ్యాఖ్యానాదికముగల గ్రంథముల సహాయములేక భాషాబ్ధి నీదఁజాలరు. ప్రతిగృహస్థుని యొద్దఁ బంచకావ్యములలో నేదో యొకకావ్య ముండును. ప్రతిగృహమునఁ బోతరాజుగారి భాగవత మున్నది. రామాయణపారాయణము చేయు నిండ్లింకను గనఁబడుచున్నవి. భారతము కొనినప్పటినుండి రాత్రులు చక్కఁగా నిద్రపట్టుచున్న వారున్నారు. నాటకశాలాధికారులు పాండవాజ్ఞాతవాసములో "శాకుంతలకు నల్లచీర సుందరముగా నుండు" నని బోధించుచున్నారు. ఇట్టి మమ్మందఱ నిరర్థక జీవనము గలవారిం జేసిన మీదేలోపము. స్వభాషాభిమానము మాకుఁ జచ్చిపోవుచున్నది. పుట్టినప్పటినుండి మాటలాడుచున్నది బాల్యమునుండి యభ్యసించుచుండినది యు నగు మాతృభాషకంటె "మున్షీ"గారియొద్ద రెండురూపాయలిచ్చి నెలదినములు చదివిన యితరభాష మాపాట్టకై తుదకబ్బుచున్నది. ఆఱునెలలు మేనమామగారింట నుండిన కతంబున నబ్బిన ఫ్రెంచిభాష మాకుఁ బండితబిరుద మిప్పించి పిత్రార్జితముకంటెను మిన్నయగుచున్నది. అదియొకవిధముగా మాతామహార్జితమే గదా! తెనుఁగు త్తరముం జదివించుకొనునవస్థకు వచ్చుచున్నారము. కొందఱు తెనుఁగు చదువ మని నియమము చేసికొనఁబోవుచున్నారఁట. నీవు తెనుఁగున వ్రాయుటచే నేదో యని పూర్తిగాఁ జదువలే దని చెప్పువారు గలరఁట. నా పుస్తకమున కక్షరములతోఁ గూడిన మాటలక్కఱ లేదు. అభిప్రాయము తెలియఁ జేయుట యే ముఖ్య మనుచు సంజ్ఞలపుస్తకములు వ్రాయఁబోవుచున్నారు. మూఁగవారే లోకము నుద్ధరింపఁబోవు నవస్థ రాఁగలదు.

విద్వద్వరేణ్యులార! ఈసమయములో మీరెల్లరు సూక్ష్మబుద్ధి నాలోచించి యేపంచకావ్యములు తగునో నిశ్చయించి యేరీతివ్యాఖ్యానము లుండవలయునో నిర్ధారణచేసి, యేమహాత్ము లీపనిం బూని ప్రకటింపసమర్థులో విచారించి, దయయొక్కఁడు గలదేని యీపంచకావ్యములం జదివినపిమ్మట సాహిత్యము కుదురుటకై యేగ్రంథము లుండవలయునో తెలిపితిరేని కొందఱుగాకున్నఁ గొందఱైన గమ్యస్థానముఁ జేరెదరు. ఇంతపాటియుపకారము మనకున్న గ్రంథములలో నుండియే కరుణించితిరేని శాస్త్రము లాంధ్రీకరించి యిచ్చినంతపుణ్యము కట్టుకొందురు.

పైని వివరింపఁబడిన కావ్యములపైఁ బలువురు విద్వాంసులు బహువిధములగువిమర్శనములు ఖండనమండనములు వ్రాసియుంచిరి. అవి యన్నియు నశక్తుఁడ నగు నేను జదివియుండలేదు. చదివినవారు మార్గముల నాంధ్రపం

చకావ్యములలో నాచరణమునకు దెచ్చుచున్నట్లు నాకుఁ దోఁపదనుట నాసా
హసవాక్యమేమో. నాచెవి నింతవఱకుఁ బడలే దనుట, నక్క గాలివాన సా
మెత వంటిది కావచ్చును. ఏమనినను నసామర్థ్యమునకుఁ బర్యాయపదములే
గదా. ఎవ్వ రేదిచెప్పినను నది వారివారి సామర్థ్యమానదండమే యగుచుండు
ను. మీయెదుటఁ బెద్దపెద్దమాటలతో శాస్త్రచర్చ మొదలిడినచో గోల్డుస్మిత్తు
చెప్పిన "లెర్నెడ్ స్ట్రేంజరు" వంటివాఁడ నగుదును. నాకర్థమైనంతవఱకు నను
భవమునకు వచ్చినంతవఱకు నాంధ్రవిద్యార్థులు నేను దెల్పినపద్ధతిని జెప్పుగురు
వులయొద్దఁ బంచకావ్యములం జదువుట లేదనుదానిపై విమర్శించువా రున్నచో
నాకుఁ బరమానందము.

ఇప్పుడిప్పు డెవ్వ రేవిషయముం జెప్పినను దమలాభమునకే చెప్పుచున్నా
రను సాధారణాభిప్రాయము నొకరిం గాంచి యొకరు పూనుచున్నారు. (ఈయభి
ప్రాయములో స్వవిషయము చేరియుండలేదు) ఇందు నేను స్వలాభము చూచి
కొని యుండలేదు. నేను స్థాపించినకావ్యపాఠశాలలోనికి మీరుసహాయము చేయ
వలదు. గురుద్దేశమేదో పెట్టుకొని యింతవ్రాసినాఁడ నని విమర్శనలకుఁ దొడఁ
గవలదు. భూగోళశాస్త్రము, దేశచారిత్రమును విషయప్రధానములు గావున
భాషలోఁ దప్పులున్నను నిబ్బందిలేదను మీపూర్వాభిప్రాయమును విడువక
"ఏకోహిదోషో గుణసన్నిపాతే" యను నది భాషా(కావ్య)విషయముగా దను
మాటను మఱచిపోయి, యేభూగోళము, యేదేశచరిత్రము నితరభాషలలో దుష్ట
భాషలో వ్రాయఁబడినవో యనిచూడఁబోక, ఇందేమైన సారమున్న గ్రహించి
ప్రజోపకారము చేయఁ జూడుఁడు. భాషనుద్ధరింపుఁడు. నేనిందు నిమిత్తమాత్రుఁడను.

అన్నియుఁ గలిపి నోటి కందింపవలదు. మీయాశీర్వాదమున ముందు
నాఁటికి మీరిచ్చినవ్యాఖ్యానముల సహాయమువలనఁ గవులచారిత్రములును వారి
వారిగ్రంథములలోని చమత్కారములును వారిలో వారియనుసరణవిషయము
లును మేమే కనిపెట్టి శృంగారనైషధములోనిపద్యములవంటి పద్యములు మను
చరిత్రములోను, మనుచరిత్రములోని పద్యములవంటివి వసుచరిత్రములోను గల
వానినెంచి యేపద్య మెంతరసవంతముగా నున్నదో విమర్శించుపాటి బుద్ధికుశల
త గలవారిఁగా నొనర్ప యత్నింపుఁ డని ప్రార్థించుచు నాభాషామంజరిని సమా
ప్తముచేయుచున్నవాఁడను.

కొత్తపల్లి సూర్యరావు.

॥ శ్రీరామజయము.

# చోళ పాండ్య దేశాంధ్ర ప్రాబల్యము.

[నా చెప్పంబోవు చోళపాండ్యదేశాంధ్రప్రాబల్య మను వ్యాసమునందలి చోళదేశమనఁగా తంజాపురీమండలము పాండ్యదేశమనఁగా మధురానగరప్రాంతము నని తెలిసికొననగు. వ్యాసమునం గలతప్పులఁ బరిగణింపక యొప్పులఁ గ్రహించి బహుమానింతురని వినయముతో వేఁడుచున్నాఁడను.]

---

శ్రీమన్మహాశయులార !

ఆంధ్రభాష నన్నయభట్టు కాలము మొదలుగ నాంధ్రదేశమునఁ బ్రబలతగని క్రమక్రమముగఁ దామరతంపరయై మహాభివృద్ధిగా నున్న దని యనేక చరిత్రకారుల ద్వారమున మన మెఱిఁగి యున్నారము. భాషయొక్క గౌరవగాంభీర్యాదుల వర్ణింపను దద్విషయమై ముచ్చటింపను దాక్షిణాత్యాంధ్రుఁడ నగు నేనర్హుఁడనుగాను. ఈ త్రిలింగభాష ద్రవిడదేశము నాఁబరఁగు చోళపాండ్య దేశములయం దెంతవఱ కేమండలేశ్వరుల యాశ్రయమున వన్నె కెక్కెనో తద్భాషాస్థితి యిప్పటికెట్లున్నదో యనువిషయముం దెలిసికొనవలసినది యత్యావశ్యకము. చోళపాండ్యచక్రవర్తులు వరుసగాఁ దమస్వదేశము లగు చోళపాండ్య దేశములను దమతమ వంశపారంపర్యముగాఁ బరిపాలించుచు ద్రవిడదేశస్థులు గాన ద్రావిడభాషాకవులకుఁ బ్రోత్సాహం బొసంగుచు రాఁగాఁ దద్భాష ప్రాబల్యముం గని యిప్పటికి నేకొఱఁతయు లేక కొనియాడఁ బడుచున్నది. 11-వ శతాబ్దప్రాంతమున "వేంగై నాడన్" (వేఁగిదేశాధిపతి) అను బిరుదుగల రాజరాజ కులోత్తుంగచోళముఖ్యు లాంధ్రదేశమును జయించి యేలుచున్న కాలమున నేదో యొక కారణమునఁ గొందఱు ద్రవిడదేశస్థు లాంధ్రదేశముం జేరి స్థిరులైరి. ఇప్పటికి వారివంశములు ద్రావిడులునాఁ బిలువం బడుచున్నవి. కాని, వారాంధ్రదేశమున ద్రావిడభాషాప్రచారమును మఱచినారు. ఆంధ్రులుకొందఱు విజయనగరరాజ్యస్థాపనాత్పూర్వము ద్రవిడదేశముం జేరి కొన్ని రాజ్యములను స్థాపించిరి. రాజ్యాధికారుల స్వజాతి భాషలెవ్వియో యాజాతివారికిని భాషకును బ్రోత్సాహ మొసంగియు నుద్యోగవ్యవహారములయందు వానిని బహుమానించుచును స్వజాతిభాషాభిమాన ధురంధరులై యుండిరనుటకు నాయఁ

కరాజవంశపరిపాలితంబులగు పాండ్యచోళదేశములే దృష్టాంతము. దీనింబట్టి విదేశ భూపాల పరిపాలితరాజ్యభాష కింతయును లోపము గలిగినట్లూహింపఁగూడదు. ఇప్పటికి నీవిషయము ప్రత్యక్షానుభవసిద్ధము. ఆంధ్రభోజుం డగుకృష్ణదేవరాయలు నాగమనాయఁకుని పాండ్యదేశమునకుఁ బ్రధానపట్టన మగు మధురకు రాజప్రతినిధింగా నియమించెను. తరువాత నతనికుమారుఁడు విశ్వనాథనాయఁకుఁడు తద్దేశాధిపతియై రాజ్యభారము వహించెను. అప్పటికే ద్రవిడదేశమం దాంధ్రభాషావ్యాప్తి ప్రారంభమై క్రమముగా వృద్ధినొందెను. విశ్వనాథనాయఁకు డాంధ్రులఁ బెక్కండ్ర నుత్తరదేశమునుండి రావించి యాదరించెను. ఈతని పరిపాలనమున విశేషకార్యమేమనఁగా :—తెలుఁగుఁ దనదేశస్థుల దండనాథులం జేసి తత్సేనాసంరక్షణమునకై యనేకభూముల మాన్యములుగా నిచ్చుట. ఇప్పుడు వారు సేనానాయకులు గాకున్నను భూముల మాత్ర మనుభవించుచు జమీందారు లనఁ బరఁగుచున్నారు. చోళదేశాధికారమును వహించిన నాయఁకరాజులలోఁ బ్రథముఁ డగుచెవ్వప్పనాయఁకుఁడే చోళదేశమునం దాంధ్రవ్యాప్తికి మూలస్థానము. చోళపాండ్యదేశముల నాంధ్రవ్యాప్తి విజయనగరరాజ్యాధిపతులకుఁ బూర్వము లేదనియుఁ, దదనంతరమే కలిగిన దనియు ననుట కాధార మేమన, ద్రవిడదేశాంధ్రులకిప్పటికిని సర్వమాన్యభూము లున్నవి. ఇవి యన్నియు నాయఁకభూపాలదత్తములు కాని, తత్పూర్వద్రావిడభూపతిదత్తములు కావు. ఏకథ యెట్లున్నను, ద్రావిడదేశమున నాంధ్రులును నాంధ్రభాషయు విశేషముగ వ్యాపించె ననుట సిద్ధము. విజయనగర రాజ్యావసానమున, సనఁగాఁ, బదియాఱవశతాబ్దోత్తరార్ధమున నాయఁకరాజులు చోళపాండ్యదేశములకు స్వేచ్ఛాధికారులై యవ్వారలం బరిపాలించుచుండిరి. ఆంధ్రభూపాలలామయు ద్రవిడదేశము నలంకరించె. అయినను, మధురాపురమున విజయరంగ చొక్కనాథనాయఁకునకుఁ బూర్వమును దంజాపురమున రఘునాథనాయఁకునకుఁ బూర్వమునను గవులు తెలుఁగుఁగబ్బము లల్లి భాషాలంకారం బొనర్చిరనుట కాధారంబు కనంబడదు. కాని, గీర్వాణద్రావిడగ్రంథములు మెండుగఁ గనఁబడుచున్నవి. దీనికొక దృష్టాంతము. తంజాపురము రఘునాథనాయఁకుని జనకుఁ డగు నచ్యుతప్ప నాయఁకుని రాజ్యకాలములో గోవిందదీక్షితులను నొకపండితుఁడు ప్రధానసచివత్వము వహించి సంగీతవేదాంతాదిగ్రంథములు గీర్వాణమునఁ బెక్కింటిని రచించెను. ఈయచ్యుతగోవిందులకీర్తిగౌరవముం గూర్చి యొకానొకకవి,

శ్లో. త్రిషు చాద్యంతనామానౌ మహీక్షిద్దీక్షితావుభౌ
శస్త్రశాస్త్రచకుశలా వాహవేషు హవేషుచ.

అనినుతియించెను. నన్నయభట్టారకానపూర్వ మాంధ్రభాషయు గ్రంథములుఁ బ్రసిద్ధములుగా లేనట్లు రఘునాథవిజయరంగ చొక్కనాథనాయకాత్పూర్వము ద్రవిడదేశమున నాంధ్రపండితు లున్నను దద్విరచితగ్రంథములు లేవు. త్రిలింగభాషోద్ధారణార్థము దినదినవర్ధమానమగుచున్న యాంధ్రసాహిత్యపరిషత్తునకై గ్రంథములు సేకరింప నేను దక్షిణదేశమునఁ గొన్ని మాసములు సంచరింపఁగా మధురాప్రాంతమున నగపడిన దాక్షిణాత్యాంధ్రకవివిరచిత గద్యపద్య ప్రబంధములు కొన్నికననివియుఁ గననివియుఁ జిక్కినవి. అవియన్నియు విజయరంగ చొక్కనాథభూపాలుని కాలమున రచింపఁ బడినవికాని తత్పూర్వభూపాలకాద్యతాంధ్ర కవివిరచితగ్రంథములు గానరావు. తంజాపురీప్రాంతమునందు రఘునాథ భూపాలునికాలమునందే యాంధ్రకవిత్వము ప్రాబల్యముం గనియెం గాని యంతకుముందు లేదనుటకు సందియము లేదు. తంజాపురి రఘునాథనాయకుని కాలము 17-వ శతాబ్దారంభము (1614 సం). మధురాపుర విజయరంగచొక్కనాథ నాయకుని కాలము 18.వ శతాబ్దారంభము (1712 సం.). ఆంధ్రభాషార్ణవగ్రంథకృతిపతి యగు నవసాల (పుదుకోట) రాయరఘునాథతొండమాను కాలము 18-వ శతాబ్దాంతము. ఏతద్విషయములంబట్టి చూడ ద్రవిడదేశము నాంధ్రభాషాయువతి పదునేడవశతాబ్దము మొదలు 19-వ శతాబ్దమువఱకు, ననఁగా, రెండువందలసంవత్సరములు యౌవనదశతో నలంకరించి పదంపడి యాశ్రితదేశమువదలి స్వదేశముంజెందె.

ఇఁకఁ గవిత్వవిషయము చర్చింతము. తంజాపురి రఘునాథనృపాలునికాలమం దనేకాంధ్రకవులు తద్రాజసభ నలంకరించిరి. వారిలోఁ జేమకూర వేంకటపతి యొకఁడు. ఇతఁడు విజయవిలాసమును, సారంగధరచరిత్రమును విరచించెను. విజయవిలాసముంగూర్చి "యాంధ్రప్రబంధములలో నుత్తమమనియు దేశ్యపదభూయిష్ఠ మనియుఁ బ్రతిపద్యచమత్కారము గలదనియు నాపుస్తకమును బహుగ్రంథపరిశోధనమున నచ్చువేయించిన సరస్వతీపత్త్రికాధిపతులగు శ్రీపోలవరము జమీందారు గారు పీఠికయందు వ్రాసినారు, ఇప్పొత్తమును బిల్లవసుచరిత్రమని చెప్పుదురు. కుందవరపు చౌడప్పకవి యొకఁడు. ఈతఁడు కవి చౌడప్పశతకమును

నీతిశతకమును రచియించెను. ఈతఁడు దక్షిణదేశస్థుఁ డనుటకుఁ దనశతకములో నుడివిన—

క. నేరుతునని మాటాడఁగ, వారిజభవునంతవానివశమా తంజా
వూరిరఘునాథనాయఁడు, గారెఱుఁగఁగఁ గుందవరపుఁ గవిచౌడప్పా.

యనుపద్యము సాక్ష్యము. చౌడప్పశతకమును సీసపద్యాంధ్రనిఘంటువును రచించినకవి యీచౌడప్పయే కావచ్చును.

రఘునాథభూపాలుఁడు స్వయముగ భాషాపాటవము గలవాఁడు, ప్రతిభావంతుఁడనుటకు నతండు రచియించిన సంగ్రహరామాయణాది గీర్వాణకావ్యములును వాల్మీకిచరిత్రాద్యాంధ్రగ్రంథములును ప్రమాణములు. రఘునాథనాయఁకుని కుమారుండగు విజయరాఘవభూపాలుండును గవితాసామర్థ్యముగలవాఁడై రఘునాథాభ్యుదయాదిగ్రంథములను దెనుఁగున రచియించినవాఁడు. విజయరాఘవభూపాలు నాస్థానమున విజయరాఘవాభ్యుదయాదిగ్రంథకర్త యగు కాళయకవిప్రముఖులు ప్రసిద్ధిఁగాంచిరి. ఈరాజుతోఁ జోళదేశ నాయఁకరాజవంశము ముగిసెను. ఇటీవల కస్తూరిరంగకవి యానందరంగపిళ్లెగారికిఁ గృతియిచ్చి రంగరాట్ఛందమును, సాంబనిఘంటువును మఱియు గణపవరపు వేంకటకవి సర్వలక్షణశిరోమణి, ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసమును విరచించిరి. సవరము చిననారాయణనాయఁకుఁడు కువలయాశ్వచరిత్రమును రచియించెను. తర్వాత సమర్థకవు లెవ్వరునున్నట్లు కనఁబడదు.' ఈవిషయముం గుఱించి నేను సంగ్రహముగాఁ జెప్పితిని. ఏతన్నాయకవంశచరిత్రమును దత్కాలకవికృతగ్రంథముల వివరమును దంజావురీ పుస్తకభాండాగారమును శ్రద్ధతో విమర్శించిరేని స్పష్టమగును. పాండ్యమండలేశ్వరుం డగు విజయరంగచొక్కనాథుని కాలమందుఁ దెనుఁగుఁగవులు పెక్కండ్రు తద్రాజాదరముం గనిరి. రఘునాథభూపాలుని సభలో నున్నకవులసంఖ్యకంటె విజయరంగ చొక్కనాథుని యాస్థానములోని కవులసంఖ్య యెక్కువ. ఇతనికాలమునంగల కవులంగొందఱను వారురచించిన కొన్నిగ్రంథములను బేరొంది నియెదను.

1. సముఖ వేంకటకృష్ణనాయఁకుఁడు :- అహల్యాసంక్రందనము, జైమినిభారతము, సారంగధరచరిత్రము, రాధికాసాంత్వనము ననుపుస్తకములను రచించెను.

2. కుందుర్తి వేంకటాచలకవి :- మిత్రవిందాపరిణయమును, కార్తికమాహాత్మ్యమును గూర్చినవాఁడు.

3. వెలిదండ్ల అలగిరికవి :- సుదంతాపరిణయముం జేసెను.
4. శేషము వేంకటకవి :- తారాశశాంకవిజయమును రచించెను.
5. పెద్దపూఁడి ఎఱ్ఱయ్య :- యువజనహృదయరంజనము నొనరించెను.
6. శ్యామరాయకవి :- శ్రీరామాయణవచనమును వ్రాసెను,[గూర్చెను.
7. తుపాకుల అనంతరాజు :- విష్ణుపురాణాదివచనగ్రంథములం బెక్కంటిని
8. తిరుపతిరామభద్రకవి:-హాలాస్యమాహాత్మ్యవచనమును రచియించెను.

వీరు కాక మఱి యెందఱో యాంధ్రకవు లున్నట్టులు తెలియుచున్నది. విజయరంగచొక్కనాథభూపాలుఁడు భావికాల మెఱింగినవాఁడై సర్వసాధారణముగ జనుల కానందకరమగునట్లు మొట్టమొదట వచనకావ్యముల రచియింప మొదలుపెట్టి తాను శ్రీరంగమాహాత్మ్యాది వచనగ్రంథములను రచియించినదే కాక నిజాశ్రితకవులచేతఁ బెక్కువచనగ్రంథములను భూలోకమున వర్ధిల్లఁజేయించెను. సులభశైలివియు నవరసభరితములు నగు నిట్టి ప్రౌఢవచనగ్రంథము లౌత్తరాహులకు లభింపమిఁ బరవస్తు చిన్నయసూరిగారికిఁ బూర్వము వచనకావ్యములు లేవని భాషాచరిత్రకారులు సాధించిరి. ఇయ్యది మిథ్యాభిప్రాయమని మ॥ జయంతి రామయ్యపంతులుగారు వచన జైమినిభారత పీఠికయందు నిరూపించిరి. మ॥ అక్కిరాజు ఉమాకాంతముగారు తమయరవదేశమునందలి యాంధ్రవాఙ్మయ మనుగ్రంథమున "దాక్షిణాత్యాంధ్రకవిత్వము శృంగారాతిరేక" మనిచెప్పి "బిల్హణీయమునకు బిల్హణీయములుఁ, దారాశశాంకమునకుఁ దారాశశాంకములు, రాధికాసాంత్వనమునకు రాధికాసాంత్వనములు రచించిన యీదాక్షిణాత్య కవుల శృంగారాభిరతి యేమని వర్ణింతుము." అనిచెప్పిరి. కృష్ణస్వామి పేరిడి యొకరురచించిన బిల్హణీయ మొకటియున్నదని యెఱిఁగి సాంబకవి వేఱొక బిల్హణీయమును రచించెనని నిర్ధారింప నాధారములేదు. శేషము వేంకటకవి తారాశశాంకము రచించెను. పెద్దపూఁడి యెఱ్ఱయ యాకథనే యువజనహృదయరంజన మనుపేరుతో రచియించెను. వీరిద్దఱు నొకకథనే రచియించి తమతమ కవిత్వప్రౌఢిని వెల్లడించుకొనిరి. వీరిద్దఱు నొక్కచోటివారు. ఉత్తరాదికవులు వీరికి మార్గదర్శకులై రచియించిన తారాశశాంకవిజయమేదో యువజనహృదయరంజనమేదో తెలిసికొనఁ గోరుచున్నాఁడను. సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు రాధికాసాంత్వనము నేకాశ్వాసమున ముగించిన ముద్దుపళని విస్తరించి యనేకాశ్వాసముగ నొనరించెను. వీరిలో నొకరికొకరికేమి సంబంధము !

మ॥ శ్రీ ఉమాకాంతముగారేదో దాక్షిణాత్యకవులపై నొక తప్పిదమారోపించిరి గాని తిక్కాధ్వరియుఁ గంకంటి పాపరాజు నుత్తరరామాయణము లొనరించిరి. చేమకూర వేంకటకవియుఁ గూచిమంచి జగ్గకవియు విజయవిలాసము, సుభద్రాపరిణయము నొనరించిరి. ఉత్తరరామాయణమున కుత్తరరామాయణములు విజయవిలాసమునకు విజయవిలాసములు పుట్టిన వనవచ్చునా. ఈవీరివాక్యములం బట్టియే కావచ్చు నానడుమ నొకరు (ఆంధ్రవాల్మీకిరామాయణవిషయములోనని జ్ఞాపకము) వసుచరిత్రమునకు పిల్లవసుచరిత్రములు, రామాయణమునకు నానా రామాయణములు బైలువెడలిన వని వ్రాసిరి. ఇవియన్నియు నిస్సారవాక్యములు. కవులు కవులే, వారిప్రౌఢి ప్రౌఢియే. భాషాపోషణమునకై యుపకారమొనర్చు కవులు మనహేళనములతోఁగూడిన పొల్లుమాటలను బరమార్థముగా గణింపరు.

విజయరంగ చొక్కనాథుని పరిపాలనము క్రీ. శ. 1731తో ముగిసెను. నవపాలపురవరాధిపుండగు రాయరఘునాథుని పాలనకాలము క్రీ. శ. 1767 ప్రారంభము. ఈనడుమనున్న 35 సంవత్సరములకవు లనేకగ్రంథమాలికల నాంధ్రభాషాసతి నలంకరించిరి. గ్రంథవిస్తరభీతిచే వారిలోఁ గొందఱనే పేర్కొనియెదను.

1. సీనయకవి :—సంధిగ్రామము, (తిరుచందూరు), షణ్ముఖసహస్రమను గ్రంథమును రచియించెను. ఇందు వేయి యుత్పలమాలలు మొదలగు వృత్తములు "షణ్ముఖా" యను మకుటముతోఁ గలవు. ఇది లక్ష్మీసహస్రముకంటె ముందటిదని తలంచెదను.

2. భాస్కరవేంకటాచల కవి :—సేతుమాహాత్మ్యము.

3. అనంతనార్యుఁడు :—గాధేయోపాఖ్యానమును సేలము జమీందారు బధిర కృష్ణమనాయఁకునకుఁ గృతి యిచ్చి రచించెను. వృద్ధాచలమాహాత్మ్యమును, తిరుచనాపల్లి మండలము పెరంబలూరునకుఁ జేరిన వెంగుళగ్రామములోని లింగారెడ్డి కంకిత మొనర్చెను. రేవూరి అనంతయజ్వ, శ్రీముష్ణమాహాత్మ్యమును వెంగుళము కృష్ణారెడ్డి కిచ్చెను. శివరహస్యఖండమును తుఱైయూరు (తీర్థపురము) నందీశ్వరునకు సమర్పించె.

4. విశ్వేశ్వరయజ్వ :—కృష్ణవిలాసము-అరమంచి తలమలేంద్రాంకితము

తిరుచనాపల్లి (త్రిశిరఃపురము) మండలములోఁ జేరిన పుదుకోట సంస్థానాధిపతియగు రాయరఘునాథ తొండమాన్ (1767-89) కాలమున నాంధ్రమీఁదేశమున నున్నతదశఁ జెంది యనంతరము క్షీణదశకు వచ్చెను. ఈప్రభువు నొద్దనున్న యాంధ్రకవులలో నెక్కుడు ప్రతిభావంతుఁ డుద్దండకవి పుత్రుఁడు నుదురుపాటి వేంకనార్యుఁడు. ఇతఁడు సమస్తశుద్ధాంధ్రపదముల శోధించి యమర సింహకృతనామలింగానుశాసనమున నేకాండమున నేయేవర్గములలో నే యే పర్యాయపదములున్నవో వానికి వరుసగా దొరకినంతమట్టుకుఁ బద్యకావ్యముగ నాంధ్రపదములం గూర్చి యాంధ్రభాషార్ణవమను నిఘంటువును నిర్మించి యాంధ్రలోకము నుద్ధరించె నన్నచో నీతని విద్వత్త్వాదికవిశేషములు వర్ణనాతీతములుగదా. ఈతండే పార్వతీపరిణయమను షష్ఠాశ్వాసపరిమితోత్తమ కావ్యమును రచించి తనకాశ్రయుండగు రాయరఘునాథ తొండమాన్ పే రిడియెను. ఈకావ్యోత్తమగౌరవముంగూర్చి సరస్వతీపత్రికాధిపతులు పీఠికలోఁ బొగడియున్నారు. ద్రవిడదేశాంధ్రకవికృతగ్రంథములలో గ్రామ్యప్రయోగములు కొన్ని యున్నవి. "ప్రమాదో ధీమతా మపి" యని కలదుగదా! ఆంధ్రకవితాపితామహుని గ్రంథములోనే సందర్భవిరోధాములున్నవు డాధునికులు నంగున ద్రవిడదేశవాసులు నగునాంధ్రులకవిత్వములోని పొరపాటులు వారితోఁబుట్టువు లని చెప్పుట సాహసముకాగు. వ్యాకరణాదిదోషములు కొన్నింటిం ద్రోచిపుచ్చిన మొత్తమున ద్రవిడదేశాంధ్రగ్రంథములు వృత్తిరీతిపాకశయ్యాలంకారామోఘంబులయి యద్భుతవర్ణనాసమన్వితంబులై లోకానందకరంబులై యున్నవనుట కేసందియమును లేదు. వేంకనార్యుఁడు మల్లపురాణాదులఁ జెక్కింటి నొనర్చి కీర్తిం జెందెను. ఈతనికాలమున నున్నకవులు లీలావతీదండకాదిగ్రంథకర్తయగు కవిశేషయాదిప్రముఖులు. వేంకనార్యుని షష్ఠకుమారుండగు సాంబకవి బిల్హాణీయము నాంధ్రకావ్యముగ రచించెను. నుదురుపాటి వేంకనార్యుఁడు రచియించిన రఘునాథ తొండమాన్ వంశావళింగాంచి తచ్ఛేషములు రఘునాథప్రతాపమాలికాదు లాతని సంతతివారు రచియించిరి. 19-వ శతాబ్దారంభమునుండి, యనఁగా, మీఁదఁ జెప్పఁబడిన కవులకాలానంతరమున రాజాదరణము లేమిని దెనుఁగుభాష నితరభాషలు ముట్టడింపఁ గ్రమమున నది దాక్షిణాత్యాంధ్రులకు దవ్వై యుత్తరదిశను మరలఁ జేరెను.




చోళదేశాంధ్రప్రాబల్యమూలమును దద్వృద్ధియును సంగ్రహముగ నా శక్తికొలఁదిని వినిపించితిని. నేను దాక్షిణాత్యాంధ్రుఁడనుగావున [illegible]షయము కొంతశంకింపక పరికించి చెప్పవలసియున్నది. మేముత్తరదేశమునుండి [illegible] వందల యేఁబదిసంవత్సరములకుఁ బూర్వము దక్షిణదేశమునందుఁ జేరి స్థిరపడి యున్నారము. అధిక సంవత్సరములు కాను కాను, అఱవలసాంగత్య మధికమై నానాఁటికి మాకాంధ్రభాషాభిమానము తగ్గి మేమాంధ్రుల మని తలంపనివారమై గృహనామములను మఱచి కొందఱము, ఆంధ్రభాషను మఱచి కొందఱము, బొత్తిగా మఱవకున్నను జదువను వ్రాయను నేరక మాటలాడుటతోనే తృప్తిపొంది కొందఱమును, మాతండ్రులవఱకు "ఓన్నమశ్శివాయ" యని యక్షరాభ్యాసము జరుగుచువచ్చియు నిపుడు "నమోత్తుశింధం" అను దశకు వచ్చి కొందఱమును, చింత చచ్చినను బులుపు చావలేదను సామెతగాఁ గొందఱమును దలయెత్తుకొని తిరుగుచున్నాము. ఆంధ్రులమైనను మాకు, అటుక, మేఁకు, అను నిట్టిమాటలు తెనుఁగులో నుపయోగించుటకుఁ దెలియక, పరణి, ఆణి, కట్టాయము మొదలగు నఱవమాటలతోనే ప్రొద్దు పుచ్చుకొనుచున్నాము. ఔచిత్య మెఱుంగక తెనుఁగు పదములను దాఱుమాఱుగా నుపయోగించుచున్నాము. ఇటువంటి దురవస్థ మాయశ్రద్ధవలననే వాటిల్లినది. ఔత్తరీయులు మమ్ము నఱవలని వాదుచున్నారు. అఱవవారన్ననో మమ్మన్యజాతివారనియు, నసంబంధులనియుఁ దలఁచి "తృక్తలంకాః తెలుంగాః" అని వెక్కిసంస్కృతములో బరిహసించుచున్నారు. మాస్థితి యిప్పు "డితోభ్రష్టం తతోభ్రష్ట" మైనది. "తురకం మఱచిపోయె తెనుఁగు రాకపోయె" నన్నట్లున్నారము. అఱవము నాధారముచేసికొని యామాటలకుఁ దెనుఁగులో ముక్కస్యముక్కార్థములుగా నుపయోగించుచున్నాము. పొడుగుగారండా, ఆణిని చోకాయతగలవేయండ, వంటం వేయుండ, పని లేదు, రాత్రికడుపుపోయెను, పగలురెండుమాఱులు కడుపాయెను, కూనుండా, యిట్టిమామాట లుత్తరాదివారు విని కడుపు చెక్కలగునట్లు నవ్వుచున్నారు. దీర్ఘములమీఁద నున్న యరసున్నలను నిండుసున్నలుగాఁ బలుకుచు హాస్యాస్పదులమగుచున్న మాకీనడుమ నన్నిచోడుని కుమారసంభవము తోడుపడి, కాంపురము, ఆంకలి, రోంకలి యనినిర్భయముగా వాడుకొనుండని ధైర్యముచెప్పినది. ఇట్టివి చోళదేశ (తంజావురీ) ప్రయోగములు. అజ్ఞానముననైన విజ్ఞానముననైన మే మొనర్చుకొను నాత్మనింద యొకదోషముగఁ బరిగణితమగునేమో యని యింతటితో విరమించుచున్నాఁడను. ఇంతటనుండి మాకాంధ్రసాహిత్యపరిషత్తు మున్నరకయగుంగాక ! ఇది యెట్లుండినను—

ఆంధ్రసాహిత్యపరిషత్తు స్థాపింపఁబడినపిమ్మట దక్షిణదేశమున నాంధ్రాభిమానము కొంతవఱకుఁ గలిగెను. దానికిఁ బ్రథమకారణము మ॥రా॥ దివా

బహాదరు వి. రామభద్రనాయఁడుగారు. వీరితో నేను బరిషత్కార్యార్థము ముచ్చటించినపుడు వీరికింగల భాషాభిమానమును దేశాభిమానమును దెలియఁజేసి ద్రవిడదేశమున నాంధ్రభాషాభివృద్ధికై చేయవలసిన యేర్పాటులేవియని యపుడే వారికాలోచనము కలిగినది. పిమ్మట దక్షిణదేశమునందలి యాంధ్రగ్రంథములను బ్రకటింప నభిలాషముగలవారైరి. పరిషత్తునకు సభ్యులైరి. పుస్తకప్రకటనమునకు దానిమూలముననే నడుముకట్టిరి. అందలి ప్రథమపుష్పము వేంకటకృష్ణప్పనాయఁకుని జైమినిభారతము. వీరు రెండుసంవత్సరములనుండి యుత్తరాదివారు మనదేశమునకు రానీయక పట్టుపట్టినను వీరియుత్సాహము విడువక యీ పరిషన్మహాసభను మనదేశమునకుఁ దెచ్చి మనకందఱకుఁ దెనుఁగు నభివృద్ధిచేసికొనుటకు మార్గములం జూపినవారు. పాఠశాలలుస్థాపించి యందాంధ్రపాఠములను జెప్పింప నుత్సాహపడుచున్నవారు. పుస్తకభాండాగారమును నెలకొల్పినవారు. ఇపుడైనను మనవారీవిషయము నాలోచించి దక్షిణదేశాంధ్రకవుల గ్రంథములను బ్రకటించుట, పాఠశాలల నేర్పఱుచుట, యున్నపాఠశాలలలో నాంధ్రోపాధ్యాయులనుగూడ నియమించుట, విద్యార్థులనాంధ్రమును ముఖ్యభాషగా నేర్చుకొనుటకుఁ బ్రోత్సాహమొసఁగుట, తాము చిన్నవారి కభిరుచిపుట్టుటకై యాంధ్రగ్రంథములను జదువుట, యందందు సభలేర్పఱచి యాంధ్రభాషనుగుఱించి ముచ్చటించుచుఁ దత్ఫలితమును బత్రికాముఖమున వెల్లడించుట మున్నగువానిమూలమునఁ జిరకాలమునుండి సంబంధము విడియున్న యుత్తరాది నుదురుపాటివారికిని దక్షిణాది నుదురుపాటివారికిని, ఉత్తరాది మల్లాదివారికి దక్షిణాది మల్లాదివారికిని, ఉత్తరాది సాంటివారికి దక్షిణాదసాంటివారికి, ఉత్తరాద చల్లవారికి దక్షిణాది చల్లవారికి, నుత్తరాది రావిళ్లవారికి దక్షిణాది రావిళ్లవారికి పిట్లనేకులుత్తరాదివారికి దక్షిణాదివారికిఁ బునస్సమాగమముగలిగించి యన్యోన్యమైత్రిని సంపాదించి యేకకుటుంబమువలె నుండునట్లు చేయుదురుగాకయని మనవారిం గోరుచున్నాను. "స్నేహేచబంధుర్నకదాపిదూరే" అనినట్లనేక పత్రికారాజములు సయోమార్గములుం గలయీకాలమున నిదియొక కఠినకార్యముగాదు. చిరకాలముక్రిందటనే సంబంధమువిడిపోయి చాలదూరమైనను సహజప్రేమచే మన మాంధ్రభోజులైన శ్రీకృష్ణదేవరాయల వంశస్థులగు శ్రీరంగదేవరాయలవారిని బరిషదధ్యక్షులుగాఁ గోరి సహజానురాగము నెట్లు వెల్లడించుచున్నారమో యట్లే చిరకాలమునుండి యెడఁబాసియున్న మనకు నుత్తరాదివారికిఁ గలసంబంధమును సహజానురాగముచే బిగించుకొనుట కింతకంటె మంచిసమయము లేదు.

హరి సేతురామయ్య.

శ్రీరస్తు.

# శివరాత్రిమాహాత్మ్యము.

(ద్వితీయాశ్వాసము.)

క. శ్రీహిమవద్గిరిపుత్రీమ, నోహరపదభక్తిజాతనూతనసరస
వ్యాహారకావ్యనాయక, మోహనతనుజితజయంత ముమ్మయశాంతా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లని చెప్పందొడంగె. 2

సీ. కాంచనాచలముతో గర్వించి యేకొండ పెరిఁగె బ్రహ్మాండకర్పరము మోవ
నేకొండచఱులపై హిమశైలకన్యక చెంచులేమలఁగూడి సంచరించు
వజ్రాలకమరుతేవ విడంబనముసేయు నేకొండమొలచుట్టు నిందుతనయ
యల్లోనెరెసుదీవియవనీధ్రములలోన నేకొండ కైశ్వర్య మెక్కుడయ్యె
నట్టివింధ్యనగేంద్రపర్యంతభూమి, దండకారణ్యవిపినమధ్యంబునందు
రత్నపుర మనఁ గల దొకరాజధాని, కిన్నరాధీశునగరికిఁ గీసవెలితి. 3

గీ. స్ఫటికమాణిక్యపాషాణఘటితమైన, యప్పురముకోట యాకాశ మంటియొప్పు
వేడ్కఁ బాతాళభువనంబు వెడలివచ్చి, చుట్టుచుట్టినయట్టి వాసుకియుఁబోలె. 4

గీ. పట్టనంబున దేవతాభవనకోటి, తుహినగిరికూటములతోడఁ దులలుతూఁగు
నమరగంగాపయఃప్రవాహములఁ బోలుఁ, దచ్ఛిరస్థాపితోన్నతధ్వజపటములు.

సీ. మకుటదేవకిరీటమణిమయూఖచ్ఛటాపటలకిమ్మీరాంఘ్రిపంకజుండు
వికటపాటలజటామకుటకోటిఘటితకోమలతారకాకాముకుండు
గంధదంతావళశ్రవ్యాదరాట్కృత్తికంథాధురంధరకంధరుండు
కుంభినీధరసుతాకుచకుంభమృగమదస్థాసకస్థగితవక్షస్స్థలుండు
శంభుఁ డోంకారనాథుండు శాశ్వతుండు, నాయకయ యుండు నవ్వీటిపరిసరమున
నర్మదాసింధుతీరకాంతారభూమి, మఱ్ఱి యనుపేరికల్పద్రుమంబు మొదల. 6

వ. అప్పట్టనంబునకుఁ జుట్టును జనపదంబు లీలావతీశతద్రువిపాట్సింధునదీమాతృ
కంబులును, విశ్వవిశ్వంభరాభ్రాలతానుకారిసేతురేఖాలంకారంబులును, ద
టాకతరుకుసుమకేసరత్సర దమందమకరందధారాధోరణీసవాస్రవ సంవర్ధితను

ల్యానలిలకల్లోల మాలికాస్ఫుటస్ఫాయమాన నానావిధోద్యానవాటికాసం ఘసంఘటితా కాలకాలాంధకారంబులును, నారామచూతపోతనికరసుకుమార కిసలయాస్వాదకషాయకంఠ కలకంఠకామినీకోమలకుహూంకారకోలాహలాం కురితపంచమరాగరాజంబులును, రాజాన్న కలమ షాష్టిక పతంగప్రియు నానావ్రీహిసస్యప్రశస్తంబులును, ప్రవర్ధమానవనంబులును, నిబిడితసారసీకంబులును, గుళుత్థాభ్యుత్థానంబులును, సముద్గతముద్గసామగ్రీసంగ్రహంబులును, అణుకచణకచణకంబులును, సిద్ధార్థ శ్యామాక గోధూమ శర్మత్తిలజర్తిలంబులును, అదూషితమహాకోరదూషితకోన్మేషంబులును, కుస్తుంబురుకుసుమగుచ్ఛచ్ఛాయాచ్ఛటా భృంగణశోణభంగోమాణు శృంగారితజాంగలక్షేత్రంబులును నై దాశరథిచరిత్రంబునుం బోలె సీతావృత్తిసరళంబులును, చంద్రోదయంబునుంబోలెఁ గరసహస్రసంవర్ధితరత్నాలయంబులును, యదువంశంబునుం బోలెఁ గులక్రమాగతశూరపురుషోత్తమబలాభిపాలితంబును నై యుండు వెండియు. 7

మ. పరలోకస్థుఁ బతిఁ ఝుషాంకు ప్రబదికింపంగోర యోంకారశం
కరుప్రోలన్ రతి ముక్తకంఠముగ నాక్రందించె నా నొప్పు న
ప్పురబాహ్యోపవనాంతదీర్ఘికలనా......నోలాడుపు
ష్కరకింజల్క భుజిక్రియాసుఖితహంసక్రేంక్రియారావముల్. 8

మ. ధరణీచక్రముఁబోలెఁ నప్పురము విస్తారంబు నాయామముం
బరికింపంగ నశక్యమైనగరిమం బాథోధిగంభీరతం
బరిఖామండలమంబురాశి నుపమింపం బాత్రమై యొప్పనం
బరకల్లోలలుఠత్తిమింగిలఘులీమత్స్యాహినక్రోద్ధతిన్. 9

గీ. భద్రజాతియేనుంగు లప్పట్టనమునఁ, బ్రకటితస్ఫూర్తి నొప్పు సిబ్బములతోడ
విమలవారాశిఫేనఖండములతోడి, కవ్వపుంగొండబందులో కాక యనఁగ. 10

ఉ. లక్షలసంఖ్య లప్పురి కెలంకులయందుఁ గొలంకు లొప్ప వాః
పక్షిగరుచ్ఛటాపవనపాతవికంపితపంకజంబులై
వీక్షణకౌతుకంబు ప్రభవింపుచునుండును లీలమై సహ
స్రాక్షుఁడు విశ్వరూపమహిమాద్భుతముం బ్రకటించెనో యనన్. 11

శా. ఆవింధ్యాచలదుర్గమేలు శబరాధ్యక్షుండు హేమాంగదుం
డావార్ధిద్వితయద్వయావధిగఁ జక్రాధీశ్వరుల్ గొల్వ నా

శార్వేదండఘటాకపోలతలమూర్ఛద్దానధారాజల
ప్లావప్రక్రమసంవిశుద్ధజవహాలప్రస్ఫూర్తిమత్కీర్తి యై. 12

సీ. *శివునికైవడి మహాసేనానియాత్మజుండు బలభేదిపగిది నపవర్గపాయుఁ
డరవిందహితులీల నధికతాభ్యుదయుండు బుధునిక్రియ నజహాత్పుష్కగుండు
గంగాప్రవాహంబు కరణిఁ బావనమూర్తి భుజగాధిపునిభంగి భోగశాలి
యేనుంగుచందాన దానధారాశోభి శౌరిలాగున శంఖచక్రపాణి
కర్తయాశ్చర్యములకు నాకరము నీతి, కఖిలవిద్యాగమములకు నాస్పదంబు
పగఱ కుత్పాతకేతువు బంధుకోటి, కమరలోకప్రమంబు హేమాంగగుండు.

గీ. అన్నపాలుండు నీతివిద్యానిరూఢిఁ, జారదృష్టి యతాఁ గాని విచారదృష్టి
సమధికైశ్వర్యవైభవోజ్జ్వలిత నాతఁ, డష్టమూర్తి యతాఁ గాని యనష్టమూర్తి.

వ. *ఆరాజునకు నఖిలశాస్త్రవిద్యాకళాపావనగంభీరబుద్ధి యజ్ఞదత్తుం డను బ్రాహ్మణుండు దేవేంద్రునకు బృహస్పతియును వృషపర్వునకు శుక్రుండును దశరథునకు వసిష్ఠుండును రామునకు విశ్వామిత్రుండును నజాతశత్రునకు ధౌమ్యుండును నలునకు దమనుండునుంబోలెఁ బ్రధానియై రాజ్యభారంబు భరియించి యుండు; నమ్మంత్రిభార్య వినయవతి వివేకవతి విభ్రమవతి విలాసవతి సౌభాగ్యవతి లక్షణవతి యౌదార్యవతి గాంభీర్యవతి యన సర్వగుణసంపూర్ణ సుశీలాభిధానయగు బాలారత్నం బతనికిఁ బరమప్రియాస్పదంబై యుండు.

గీ. *అన్నిభాగ్యంబు లున్న నాయబ్జముఖికి, శ్రీమహాలక్ష్మి గలుగఁగ నేమి సెలవు
పుత్రవదనావలోకనోద్భూతమైన, యొక్కసౌఖ్యంబు ప్రాఁతియై యుండుఁగాన.

గీ. *తనయసంతానలబ్ధి చేదప్ప గాఁగ, విభవసంపత్తి గల్గియు విన్నఁబోయి
వనిత నిష్ఫలపుష్పదర్శనముఁ దాల్చె, శరలతాకాననమువోలె జవ్వనంబు.

సీ. కాంత పుష్పాదిభోగంబు లింపెసఁగిన వైరాగ్యవిధికిఁ దా వాల్గుఁజిత్త
మన్వయంబునకుఁ దా నాలంబ మయ్యెను దను నిరాలంబఁ గాఁ దలఁచునింతి
ప్రొద్దునఁ దగినట్టిభోజనం బొల్లక యుపవాసనంబుండ నువిద దలఁచు
సంపత్పరంపర సంభవిల్లినను నైన సంతోష మొదవదు చాన మతికి
కోమలాంగులదశహస్తతామరసము, కర్ణపూరత్వలీలకై కాలు సాఁప
గండతలదర్పణంబునఁ గదియఁజేర్చి, పడఁతి చింతించు సుతలబ్ధి వడయుటకును.

---

* ఇట్టి చిహ్నములు గల పద్యములు కలశాపురంబోలెం జాలభాగములను గాదంబరినుండి కవి గ్రహించినాఁడు.

ఉ. సంతతి లేనిదుఃఖమున సామజరాజ్యఘటాంతవైభవం
తెంతయుఁ గల్గియున్ సరసిజేక్షణ చిన్నగఁబోయి యుండు నే
మంతిని బోటికత్తెలకు మానసవృత్తి యెఱుంగఁజెప్ప కే
కాంతమ కేళిశయ్యపయిఁ గాంత గుణించు మనోరథార్థముల్. 19

ఉ. ఆచపలాయతాక్షి కనకాంబురుహంబులఁ బూజసేయు విం
ధ్యాచలకందరానిలయు నద్రిసుతాప్రియనాథు నర్మదా
వీచిపరంపరాసలిలవిప్రుషదాశ్రయశీతగంధవా
హాచమనప్రవృద్ధభుజగాధిపకంకణు నోంకృతీశ్వరున్. 20

సీ. అభిషేకమొనరించు నలినీలకుంతల శంభు సోమోద్భవాసలిలధార
నెలఁత కుభ్యర్చించు నీలోత్పలంబులఁ దరుణనిర్మలసుధాధామమౌళి
గరళకూటగ్రాసకల్మాషకంధరుమేన గంధ మలందు మీనాక్షినేత్ర
యర్పించు దివ్యోపహారంబు లెలనాఁగ కుటిలకుండలిరాజకుండలునకు
నతివ దిరుగుఁ బ్రదక్షిణం బభవునకు, గుచభరంబున నరగౌను గూనిగిలఁగ
రవలిమట్టెలమ్రోఁతతో రాయిడింప, జరణనూపురఝుళఝుళంఝుళరవంబు.

వ. *ఒక్కనాఁ డోంకారనాథునకుఁ బ్రదక్షిణం బాచరించుచు నప్పద్మాక్షి ప్రాకా
రపురఃప్రఘాణంబున నొక్కపౌరాణికుండు మహాభారతంబు వక్కాణించు
వాఁ డపుత్రకులకుఁ బుణ్యలోకంబు లేదని కథానుకథనప్రసంగంబునం బలి
కిన నయ్యింతి సంతానవిరహవేదనాదూయమానమానసయై మందిరంబున
కేతెంచి యేకాంతభవనంబున విరహశయ్యపై మేనువైచి చింతాక్రాంత
యై యుండె నంత యజ్ఞదత్తుం డమ్మత్తకాశిని నన్వేషించి. 22

ఉ. కాంతసరోజనాళలతికాతనుపాండుశరీరయష్టి నే
కాంతగృహాంతరస్థితఁ బ్రియాంగనఁ జేరఁగవచ్చె మంత్రి క
ల్పాంతమునన్ రసాతలగుహాకుహరంబున డాఁగియున్నభూ
కాంత వరాహమూర్తి హరి గ్రచ్చఱ డాయఁగవచ్చుకైవడిన్. 23

వ. డాయవచ్చినఁ గృతప్రత్యుత్థానయగు నప్పంకజాక్షియుఁ దానును బర్యంకం
బునఁ గూర్చుండి యవిరళాశ్రుపాతార్ద్రీకృతదుకూలయు ననలంకృతయు
నైన సుశీలం జూచి యజ్ఞదత్తుం డిట్లనియె. 24

గీ. వలయేడ్పుమ చెప్పవే యిందువదన, విపులశోకభరంబున వెక్కివెక్కి
త్రాటఁ గ్రుచ్చినముత్యాలదండవోలెఁ, జన్నుఁగవ నున్న వీబాష్పజలకణములు

సీ. కుదురు నిండినమంచిగుబ్బచన్నులమీఁద ధరియింపవేల ముత్యాలపేరు
ఫాలేందురేఖపైఁ బచరింప విదియేల కుంకుమంబునబొట్టు గోరఁ దీర్చి
యానచక్రోద్ధురం బగునితంబముమీఁద సవరింపవేల వజ్రాలకమరు
పాయవట్టములతోఁ బసిఁడినూపురములు హత్తింపవేల పాదాంబుజములఁ
బంచవన్నియరాచిల్కఁ బంజరమున, నేల సదివింప వనురాగ మెసఁగ మెసఁగ
నేల చింతించెదవు చెప్పు మిందువదన, గండపాళికఁ గెంగేలు గదియఁజేర్చి.

గీ. నెలఁత నులివేఁడి యైననీనిడుదయూర్పు, మాటిమాటికి నిపుడు నామానసంబుఁ
గంపమొందించుచున్నది కల్లగాదు, ప్రబలభవదీయవక్షోభవంబుఁబోలె.

క. అపరాధము సేయఁగదా, చపలాయతనేత్ర ! యేను జనవుననేనిన్
నిపుణతతోఁ జింతించిన, నెపమేమియుఁ గానరాదు నీ నెగులునకున్. 28

క. భవదాయత్తము విభవము, భవదాయత్తంబునువ్వె ప్రాణము నాకున్
భవదాయత్తము సర్వము, ధవళాంబుజపత్రనేత్ర తథ్యం బరయున్. 29

వ. ఈదుఃఖంబునకుం గారణం బేమి చెప్పు మని యడుగుటయుం బ్రత్యుత్తరం బీక యూరకున్న దానితాంబూలకరంకవాహిని మంత్రితో నిట్లను :—దేవ! దైవంబుకరుణం జేసి పెద్దకాలం బిమ్మహాదేవి సంతానలాభంబు దూరంబగుట కారణంబుగా శయనాసనపానభోజనవిభూషణపరిధానాది సముచితవ్యాపారంబులు పరిజనప్రయత్నంబునం బ్రతిదినంబు నెట్టకేలకు నిర్వర్తించుచు దేవరకు హృదయవేదన గావింపనోపక యనవరతంబుఁ దోఁపకుండఁ జరియించుచున్నయది. నిన్నటిరేపు తపనమండలంబు కుపితకపికపోలక్రోడతామ్రంబై యుదయగిరికవాటవిటంకంబు నలంకరింప వింధ్యాచలనితంబబింబంబునకు మణిమేఖలాకలాపంబునుం బోలిననర్మదాప్రవాహంబునం గ్రుంకి యోంకారేశ్వరు శశాంకశిఖాలంకారు హేమపంకజంబులం బూజించి గుడికిం బ్రదక్షిణంబు సేయునది దేవభవనప్రాకారగోపురప్రఘాణంబునం బౌరాణికుండు మహాభారతంబు వక్కాణించుచుం గథానుకథనప్రసంగంబున నపుత్త్రికులకుఁ బుణ్యలోకంబులు లేవని పలికె, నప్పలుకులు నెమ్మనంబునం గీలుకొని వాలంపములికియుంబోలె వేదన యుత్పాదింప భవనంబునకు వచ్చి యేకాంతంబు యిచ్చోట నవిరళబాష్పధారాదుర్దినాంధకారితముఖ యయి యీదుర్దశం బొంది యున్నయది యనుటయు. 30

ఆ. మంత్రి యొకముహూర్తమాత్రంబు చింతించి, యుష్ణదీర్ఘమైన యూర్పునిగుడ
నెంతచింత దీని కిది మహాబలవంత, మేమిసేయవచ్చు నిందువదన. 31

ఉ. ఊరక కుందనేమిటికి నోంకృతినాథుఁడు నర్మదానదీ
తీరనివాసభక్తజనదివ్యమహీరుహమూర్తి సదాశివుం
(?)సారసనేత్ర తత్పదపరిష్వయభీష్టశుభాభివృద్ధికిం
గారణ మాటయుంగవె వికారము దక్కి భజింపు శంకరుం. 32

గీ. ఈశ్వరుం డద్రిజానాథుఁ డిందుమౌళి, కరుణ లేకను సుతుఁ డట్లు కలుగనేర్చుఁ
జంద్రచందనచంద్రికాశైత్య మైన, పుత్త్రపరిరంభసౌఖ్యంబుఁ బువ్వుఁబోణి.33

గీ. గురుజనంబుల సేవింపు కువలయాక్షి, కమలలోచన ! ముక్కంటికరుణఁజేసి
మున్ను గురునుపదేశంబు మొనయఁగాంచి, రభిమతార్థంబు లెంద ఱేనబ్జవదన.

వ. సర్వజగత్ప్రసిద్ధంబు గదా యితిహాసంబు తొల్లి చండకౌశికువరప్రసాదంబున
మగధాధిపతి యగురాజు దైతేయకులవిమర్దను గెలువం దగినయట్టి శౌర్యనిధి
జరాసంధుం గాంచె దశరథుండు విభండకతనయు నారాధించి దిగ్గజంబులం
బోలినకుమారుల సకలలోకహితంబుగా నలుగురం బడసె నమారాధితగురు
దేవతాప్రార్థనవశంబున. 35

గీ. వెలఁది పుత్త్రోదయారంభవేళయందు, నిన్ను నెన్నఁడు చూతునో కన్నులార
విమలచంద్రోదయారంభవేళయందుఁబూర్ణిమాయామినిఁబోలెఁబుణ్యగరిమ.

వ. దేవి ! శోకంబు విడువు ధైర్యంబవలంబింపు ధర్మంబు నడువు దానంబు సే
యుము వ్రతంబులు సలుపుము సత్యంబు పలుకు మనపాలిదేవతలు మన
కభీష్టలాభంబుఁ బొందింపఁగలవారు భవ్యసంతానలాభంబున సంతోషంబు
వహింపంగల వని దుఃఖోపశమనభాషణంబులు ధర్మోపదేశగర్భంబులు చారు
మధురంబు లగుమాటల నూరార్చి కాంచనకలశోదకంబులు కరపల్లవంబున
ధరియించి నయనంబులు దుడిచి యగ్గజయానకు ముఖప్రక్షాళనం బాచరించి
మందీభూతదుఃఖ యగుట యెఱింగి మంత్రి యంతఃపురంబు వెడలి సముచిత
వ్యాపారంబులం బ్రవర్తిల్లె నది యాగమోక్తప్రకారంబున సభక్తివినయ
తాత్పర్యంబున. 37

ఉ. ఆధవళాయతాక్షి వసుధామరకోటి భజించు దేవతా
రాధన మాచరించు మునిరాజి కుపాస్తిసొంపువర్చు మంత్రవి

ద్యాధృతబుద్ధిఁ గాంచుఁ గొనియాడును యోగిజనంబు వర్ధమా
నాధికభక్తిభావమున నాత్మజసంతతిలబ్ధికామనన్.   38

గీ. ఎఱుఁగ జేనీడకన్నును నెండకన్నుఁ, జెలఁగి పూచు నేకర్మ వించిన లతాంగి
మెట్టిక్లేశంబులకునైన నీడఁబోదు, తనమనంబుననిగ్రుచుసంతానకాంక్ష.   39

సీ. భక్తితో మాతృకాభవనంబులకు నేగుఁ గావించు నతిథిసత్కారములను
వాయసంబులకు నిర్వర్తించు దధిబలిఁ గొలుచు జ్యేష్ఠాదేవి నలఘుమహిమఁ
జదివించికొనుఁ బుణ్యసంహితావ్రాతంబు మూలికామాణిక్యములు ధరించుఁ
దన్వంగి గంధాక్షతలు చిరంటుల కిడు విప్రపత్నికల గారవించుఁ దఱచుఁ
గుమ్మరావంబుకడవలు కొల్లవిడుచు, బాలురకుఁ దియ్యపండులు పంచియిచ్చుఁ
జెలులుదానునువ్రతములునలుపుచుండుఁ, దామరసనేత్రపుత్త్రిసంతానకాంక్ష.

వ. ఇవ్విధంబునఁ బుణ్యోపవాసవ్రతదానధర్మదేవతారాధనంబులఁ బ్రతిబంధదో
షంబులు వాసిన నానుదతీలలామంబు మెఱసి ప్రతిమాచంద్రబింబంబు సరసి
యందునుంబోలె గర్భం బావిర్భవించిన—   41

సీ. అభ్యంతరస్థాగ్ని యగుశమీలతవోలె నిధిగర్భ యగునబ్ధినిలయవోలె
నంతస్థసదిద్గంతి యగువియన్నదివోలె శశికుక్షి యగునస్తసంధ్యవోలె
నాలీనహార్యక్షు యగునద్రిగుహవోలె పీనధారిణి యగువినతవోలె
నస్తాంతరిత యగునలినాస్త్రరుచివోలె సూనృతాభిధ యగుసూక్తివోలె
నాదిమబ్రహ్మసంభరితోదర యగు, కైటభారాతినాభ్యబ్జకమునుబోలె
నధిగతాగస్త్య యగుదక్షిణాశవోలెఁ, బ్రథమగర్భంబు ధరియించెఁ బల్లవోష్ఠి.

గీ. పలుచఁబాఱెను గండదర్పణయుగంబు, నవమధూకప్రసూనంబు నవమధుకర
మానుగతిఁజూచుకంబులునసితమయ్యె, నవతివూఁబోండ్లయానగాబ్జములతోడ.

చ. మనమున కుత్సవం బొనఁగె మంత్రికిఁ బట్టపుదేవి గర్భశో
భనమునఁ బల్చనై చెలువు పైకొనుముద్దులనెమ్మొగంబుతో
ఘనసమయంబునందుఁ బొడకట్టినచల్లనితూర్పుగాలిచే
నవిచివకన్నె గేదఁగికి నచ్చినకూరిమిచుట్టమో యనన్.   44

గీ. గర్భభారాలసాంగియై కంబుకంఠి, చెవిశిరీషప్రసూనంబు చేర్పనోప
దట్లు ధరియింపఁగా నోపు హేమరత్న, కంఠికాహారకేయూరకటకములను.   45

క. ఎలదోఁటలఁ గేయువ్యాల, కలకంఠికిఁ జిన్నినాఁటికతలై తోఁచెం
జెలువకుఁ బాదాంబుజములు, గిలిగింతలు గొలుపుఁ గేలిగిరిగుహాలందున్.

శా. ఆసారంగవిలోలలోచనను గాఢాలింగనక్రీడలన్
వాసాగారము కేలితల్పముపయిన్ మన్నించి మంత్రీశుఁ డ
త్యాసంగం బొనరించె ముద్దుగొనె మృత్స్నాఽస్వాదనప్రక్రియా
వ్యాసంగంబునఁ గమ్మనై నయదనీయం బైనబింబోష్ఠమున్. 47

క. జలరుహనాభునివక్షస్థలికౌస్తుభమునను దీప్తిఁ దనరెడుమణిరా
ట్ఫలికాలంకృతిఁ బోలెం, బొలఁతుక ప్రత్యగ్రగర్భమున నొప్పారెన్. 48

వ. ప్రతిదివసోపచీయమాన గర్భనిర్భర యగుచు నయ్యది కౌముదీవిలసనంబునుం బోలెఁ బ్రియసఖవిలోచనచకోరికలకుఁ గోరికలు నిండించె వెండియు. 49

చ. బహుదినముల్ మహాసచివుపట్టపుదేవికి వృద్ధిఁబొందె దు
స్సహనవగర్భచిహ్నములు జాతె సఖుల్ ప్రియమందఁగా ముహు
ర్ముహురనుబద్ధజృంభితసముద్గతవిహ్వలనేత్రపద్మముల్
జహదజహత్ప్రమగ్రపురుషాయితకేలివిజృంభణంబులన్. 50

గీ. అట్లు ధవునొద్ద మెలఁగుపద్మాయతాక్షి, సముదితం బైనగర్భభారముకతమున
వమ్యగావీతజలరాశిసామ్య మైన, ప్రావృడారంభనవమేఘపంక్తిఁబోలె. 51

శా. సీమంతోన్నయసంభ్రమంబు వెలయం జేయించె శ్రీయజ్ఞద
త్తామాత్యాగ్రణి కిన్నృపాలుఁడు వింధ్యాధీశ్వరుం డర్మిలిన్
సామంతక్షితిపాలమంత్రులసమానం బైనప్రేమంబునన్
భామాసింధుతురంగరత్నములు పైపైఁ బావడల్ తేరఁగన్. 52

సీ. కమ్మగొజ్జఁగనీటఁ గలయంపిచల్లిరి మేఁగి మెత్తిరి క్రొత్తమృగమదమున
రంగవల్లులు కప్పురపుముగ్గు వెట్టిరి కీలించిరొగిఁ మాల్యతోరణములు
తరుణరంభాతరుస్తంభంబు లెత్తిరి కట్టి రెల్లెడఁ బట్టుకలువడములు
కమలచందనమాలికలును నిర్మించిరి స్తంభించి రుత్తమదర్పణములు
నాలిఖించిరి గేహకుడ్యములయందు, సర్వతోభద్రముకరికాన్వస్తికములు
పరిజనంబులు రాజాజ్ఞఁ బట్టనమున, యజ్ఞదత్తుని ప్రథమకళ్యాణవేళ. 53

గీ. వేడ్క నృత్యంబు లాడిరి వీథులందుఁ, బాడి రత్తిలి పికకుహూపంచమమునఁ
బంజళంబున ధవళప్రబంధగీత,కములనవ్వేళఁ గర్ణాటకమలముఖులు. 54

మ. అదనన్ వచ్చిరి సంభ్రమంబునను బంచారామలీలావతుల్
పదునాల్జాతులయప్సరోఙ్గనలునుం బాలిండ్లపై హారముల్
గదలం జెన్నతిసేనకొప్పులపయిం గల్హారగుచ్ఛంబు లా

ప్పఁ దదీయత్వర గండభాగములఁ గంపంబొందఁ దాటంకముల్. 55

సీ. పూజెకుండలు నిల్పెఁ బువ్వుఁబోఁడి యొకర్తు శుభవితర్దికచతుష్కోణములను
జాజాలపాలెల సర్వౌషధులు (నించి) ప్రోక్షించె నొక్క పద్మాక్షి జలము
కాంతయొక్క తె సన్నికలుఁ బాత్తరంబును దోరించె వటశాఖతోడఁగూడఁ
బీఠకంబులు వెట్టి బింబోష్ఠియొక తె మడుఁగుఁబుట్టముగప్పెనడుగుమునుఁగ.
రమణియొక్క తె వింజామరంబుదాల్చెఁ,దరుణియొక్క తె తాళవృంతంబుపూని
లలనయొక్క తె పసిఁడిసంబెల ధరించె,నాలవట్టంబు ధరియించె నతివయొర్తు.
గీ.మంత్రివేల్పించెగృహ్యోక్తమార్గమొప్ప,బ్రహ్మపదమునఁగూర్చుండిబ్రాహ్మణుండు
హోమములు రెండుబుగ్యజుస్సామ వేద,మంత్రమాదిజయాదిహోమంబుతుదగ.

మ. చెవికిం గేలివతంసకోత్పలదళశ్రీలై కపోలంబులన్
నవకాలాగరుపత్రరేఖలయి మేనం గమ్మకస్తూరియై
ధవళాంభోరుహనేత్రపైఁ గురిసె నుద్యల్లీల సీమంతపుం
నవనాజ్యాహుతిహోమసంప్రభవచంచద్వహ్నిధూమచ్ఛటల్. 58

మ. చెలికత్తెల్ చిఱునవ్వు చెక్కులపయిం జెల్వార వీక్షింప నా
ప్తులు మంత్రంబులుసెప్పఁ బ్రెగ్గడ శరత్సంపూర్ణచంద్రాస్యకున్
వలిచన్నుంగవమీఁద ముత్తెపుసరుల్ వర్ధిల్లఁ గేల్వంచుచున్
శలలీకంటక మెత్తి యాదల ముడియున్ సంధించె సీమంతమున్. 59

క. కుటిలాలకకును నాసా, పుటరంధ్రములందు మూఁడుబొట్టులు పిడిచెన్
వటఫలదళరస మధిపతి, కటకరత్నతాత్కార మొసఁగఁ గరపద్మములన్. 60

గీ. మృదులగోధూమసరులతో మేలవించి, వన్నెకుచ్చులపేరుతో వక్కరించి
పువ్వుదుండుభకంబుతోఁ బొత్తువచ్చుఁ బడఁతిపాలిండ్లపై నొప్పు పసిఁడిపేరు.

గీ. తగవు లిచ్చిరి పుట్టింటితల్లిప్రజలు, వీళ్లొసంగిరి చుట్టాలు వేనవేలు
కట్నమిచ్చె నృపాలుండు కన్నదనియఁ,బరమహీపాలు రిచ్చిరి పావడములు.

సీ. వ్యోమమండలము తురంగమధట్టమయ్యె మయ్యెఁ గరిమయుం బయ్యె దిక్చక్రవాళ
మంబరం బాతపత్రావళిమయ మయ్యె సౌరభ్యమయ మయ్యె మారుతంబు
పరివారమయ మయ్యె బ్రహ్మప్రపంచంబు జయశబ్దమయమయ్యె సకలజగము
లాతపత్రవిభూషణాలోకమయ మయ్యె సంతోషమయ మయ్యెజనులమనసు
వింధ్యపర్వత మేలు పృథ్వీవరుండు, దానుఁబట్టంపుదేవియుఁ దగవుగలిగి
సచివునింటికి నేతెంచి సమ్మదమున,నొద్దనుండి యాశోభన మొనరుచుటయు.

గీ. జవరనరఁ బూలుముడిచినసాధ్వియొకతె,యుల్లగందంబుపసుపుననూన్పఁగదిసి
పసిఁడియుత్తరజందెముల్ పాయఁబట్టి,రాచప్రెగ్గడబ్రహ్మసూత్రమున నగుచు.

గీ.దశరథునివాజపేయంబుధర్మసూను,రాజసూయంబు నుపమింపఁబ్రాఁతియయిన
పట్టనంబును దేశంబుఁ బరిఢవింపఁ, బెట్టె దొడ్డఁగ నామెంత ప్రెగడగారు. 65

వ. అంత. 66

క. నవమాసంబులు నిండిన, ధవళేక్షణ గాంచె సుతు సుధాకరతారా
రవిసుతధిషణవిధుంతుద, (?)కవులుభికములుగనవమఘటికలు నడువన్. 67

వ. ఇవ్విధంబున సుశీలాదేవి నందనుం గాంచినవార్త యంతఃపురపరిచారిణి యొ
కర్తె విన్నవించిన నమృతరసధారామయం బయినయమ్మాటకు సద్యఃప్రరూఢ
రోమాంకురనికరకంటకితగాత్రుండును దరస్మితవికసితకపోలమండలుండును
నై మంత్ర్యాఖండలుండు— 68

గీ. తాను గట్టినట్టిచీనాంబరంబులుఁ, దాను బెట్టినట్టిమేనితొడవుఁ
బ్రమదమొప్పనిచ్చెఁ బారితోషికముగ,మంత్రి యంతిపురము మానవతికి. 69

సీ. తలయంపి ధవళనిద్రాకుంభ మిడువారు రక్షాభసితరేఖ వ్రాయువారు
గౌరసర్షపరాజి కలయఁ జల్లెడువారు బలివిధానంబులఁ బరఁగువారు
లవణంబు నింబపల్లవము ద్రిప్పెడువారుఁ బ్రేము మంచంబుతోఁ బెనఁచువారు
గవలధూపంబు సంఘటియించువారును [illegible]ంచిము ట్టెడఁద యోజించువారుఁ
గదిసి దీవించువారును గండతైల, మందుకొనువారుఁ గాయంబు లందువారుఁ
బాడువారును బరిహాస మాడువారు, నైరి శుద్ధాంతసతు లరిష్టాలయమున. 70

సీ. కర్పూరసమ్మిశ్రగంధసారంబునఁ జఱిచెఁ జప్పట భిత్తిఁ జామయొకతె
వెలకిల్లఁబెట్టె నుత్పలగంధి యొక్కర్తు కప్ప గర్భగృహోపకంఠభూమి
జ్యేష్ఠాధిదేవత సేవించె నొకయింతి పసుపుఁబుట్టము గట్టి భక్తిగరిమఁ
బటముపై లిఖయించెఁ బాటలాధరయోర్తు క్రొత్తలత్తుకశశాంకునిఖరాంశు
జరఠమేషంబుకంఠదేశమునఁ జుట్టెఁ,బువ్వుదుండుభముల నొకర్తు పువ్వుఁబోఁడి
యంబుజానన యొకతె నెయ్యభిఘరింప,భుజగనిర్మోకమొకతెనిప్పులఁగమర్చె.

ఉ. మంగళరత్నదీపములమధ్యమునం బురుటింటిపాన్పుపై
నంగజసన్నిభుండు సచివాగ్రణినందనుఁ జొప్పె నంతయున్
నింగిఁ బ్రదోషవేళ నతినిర్మలతారక చక్రవాళముల్
సంగతిఁ జుట్టునుం గొలువఁ జాలఁగ నొప్పుశశాంకుకైవడిన్. 72

గీ. బాలకుఁడు చంద్రచంద్రికాపాండు వయిన, పాన్పుఁబొత్తులపై నొప్పెఁబవ్వళించి
యమృతవారాశిలోన శేషాహిమీఁదఁ, బవ్వళించినకౌస్తుభాభరణుఁబోలి. 73

గీ. దానధర్మంబులొనరించి త్యాగ మిచ్చెఁ, బ్రసవగేహంబు సొచ్చి భూపాలమంత్రి
యప్డు పావకసంస్పర్శ మాచరించి, ప్రథమతనయముఖేందుబింబంబుచూచి.

గీ. పురుడుచెల్లంగఁబుణ్యాహమునునొనర్చి, నిలయమై వతిములఁగొల్చినిజసుతునకు
మారసన్నిభునకు సుకుమారుఁ డనెడి, పేరు పెట్టెఁ బ్రధానబృందారకుండు.

గీ. పసుపుఁబుట్టంబుధరియించిపద్మనయన, సుతునినుత్సంగమునఁదాల్చిచూడనొప్పెఁ
దరణిబింబసంధ్యారుణాతపముతోడ, లలితరుచి నొప్పునాకాశలక్ష్మివోలె 76

గీ. పల్లవాధర మడుగైనయొల్లెఁ గట్టి, కొంగు మణిహేమకింకిణీకోటిఁ జెరివి
సొబగుకాటుకబొట్టుతోఁజూడ నొప్పె, వింతచెలువునఁ బచ్చి బాలెంతయపుడు.

ఉ. అక్షయవర్ణితాఖ్యఁ దనయుంబు సువర్ణలతానిబద్ధముల్
వక్షమునన్ ధరించి సచివప్రియసూనుఁడు చూడనొప్పె ను
గ్రక్షితిసంభ్రమోద్ధతిని గాండివధన్వినితండ్రి యాసహ
స్రాక్షునివైరిపేరురమునందు ధరించినదైత్యుకైవడిన్. 78

గీ. రత్నవేదికపై మంత్రిరాజసుతుఁడు, తల్లిహృదయంబు దృష్టులు తన్నుఁగొలువ
సకలజనులును బంధులు సంతసింప, జానుచంక్రమణక్రీడ సంచరించె. 79

మ. వలిచన్నుల్ వడఁకాడ వేనలులు గైవ్రాలంగ గారాపుదా
దులు తన్నెమఱి కంతలంతలను ముద్దుల్ మీఱి చూడంగఁ దాఁ
గలకాంచీమణికింకిణీకలకలాతారంబు తోరంబుగాఁ
గలహంసంబులఁ బట్టఁ బాఱును వడిం గక్ష్యావిభాగంబులన్. 80

వ. అంత నాసుకుమారుండు నత్యంతసంతోషవంతు లగు తల్లిదండ్రుల మనోర
థంబు ఫలియింప ననుదినప్రవర్ధమానుండై ......వర్ధమానసంపదనురూపం
బుగఁ గుమారరత్నంబునకుఁ గ్రమక్రమంబున......జోపనీతుండై కుమా
రుం డాచార్యగృహంబున కరిగి. 81

సీ. చదివె వేద మెఱింగి పదమువాక్యాంశించె మహానీయదివ్యాగమములు చూచెఁ
దఱచెనాదిపురాణధర్మశాస్త్రంబులు నేర్చె వీణావేణునృత్యకళలు
వాదవశ్యాంజనవదనికాగుటిలు జూద మాడంగనెఱిఁగె రత్యాగమంబు
సరహస్యముగ నింద్రజాలయంత్రక్రియాతంత్రమంత్రములఁజిత్తరువులెఱిఁగెఁ

గ్రోల్చి యోగంబు సాధించె రుద్రభూమి, సకలశస్త్రాస్త్రసంచయనమితినేర్చి
నాకళించెను విపులవైద్యక్రమంబు, సంగ్రహించెఁ గవిత్వంబు సచివసుతుఁడు.

వ. ఇవ్విధంబున సర్వవిద్యాపరిశ్రమంబునఁ బారీణుండై యుండునకుమారు
నకు శైశవంబు సరిగడచుటయుఁ బ్రదోషంబునకుఁ జంద్రోదయంబును జల
ధరంబునకుఁ జక్రవాళంబును బుష్పంబునకు వాసనాప్రకారంబును గమల
వనంబునకు సూర్యోదయంబును గంధగజంబునకు దానంబును విజ్ఞానంబునకు
మానంబును నవధ్యునకు గేయంబును రాజ్యబలంబునకు నాజ్ఞాబలంబునుం
బోలె భువనసమ్మోహనం బైనసౌందర్యంబున కనురూపం బై జవ్వనం బా
విర్భవించిన, 88

గీ. బాల్యమునయందుఁ గలుగుసౌభాగ్యరేఖ, నినుమడించినసౌందర్యమెసకమెసఁగఁ
సచివతనయుండు తా నొప్పి చారులీలఁ, బౌరజనులకుఁ గన్నులపండువయ్యె.

శా. పంచారామవిలాసినీధవళదృక్పాతీనజాలాయమా
నాంచత్కారము నిర్నిబంధనమనోజ్ఞాకారరేఖా...
పంచాస్త్రుం డగునాకుమారకుఁడు దర్పస్ఫూర్తి నవ్వీటిలో
సంచారం బొనరించెఁ గాంచనమహాసౌధాగ్రభాగంబులన్. 85

గీ. ఆదిగర్భేశ్వరత్వంబు యౌవనంబుఁ, జక్కఁదనమును నతిసాహసంబుఁ జనవు
నొక్కఁ డొక్కండు చాలు దోషోత్కరమున, కన్నియును గూడియున్నవియతని
యందు.

సీ. ఒకకొంతప్రొద్దు కందుకకేళి యొనరించుఁ గంకణంబులఝణత్కార మెసఁగ
నొకకొంతప్రొద్దు వల్లకి నఖాగ్రంబుల బహురాగముల నేర్పుఁ బ్రస్తరించు
నొకకొంతప్రొద్దు భాండికజనంబు లొనర్చు పరిహాసగోష్ఠికిఁ బల్లవించు
నొకకొంతప్రొద్దు లోకకథాప్రహేళికాబిందుమత్యాదులఁ బిచ్చలించుఁ
గొంతప్రొద్దు వినోదించుఁ గోటితలయిన, తోడివేడుకకాండ్రతో మేడమీఁద
విమలచంద్రోదయారంభవేళయందుఁ, బిల్లదీవాటలను మల్లుపెనఁగుటలను.

వ. ఇవ్విధంబునఁ దృష్ణావిషవల్లి కాలవాలంబును నింద్రియగుణంబులకు శరణం
బును మోహనిద్రకు విభ్రమశయనంబును శాస్త్రదృష్టికిఁ దిమిరోద్గమం
బును దోషాశీవిషంబులకు నావాసవల్మీకంబును సుగుణకలహంసంబులకు
బ్రావృట్కాలంబును గపటనాటకంబునకుఁ బ్రస్తావనయు ధర్మేందుమండలం
బునకు రాహువక్త్రంబు నై నయౌవనారంభంబున. 88

సీ. అజానుదీర్ఘబాహార్గళస్తంభుండు కోమలాళివినీలకుంతలుండు
కర్ణాంతవిశ్రాంతకమలాయతాక్షుండు పరిఫుల్లచంపకప్రసవకాంతి
బహుళాష్టమీశశిప్రతిమఫాలతలుండు కంబుసన్నిభచారుకంధరుండు
పరిపక్వబింబికాపరిపాటలోష్ఠుండు గంధవారణకుంభకఠినభుజుఁడు
సచివతనయుఁడు కుపితధూర్జటిలలాట,చక్షురనలార్చిరుద్గమసంప్రభూత
విస్ఫులింగచ్ఛటావలీవేష్టనమునఁ,బసిమి దప్పని వలరాజుపగిది నొప్పె. 89

సీ. సరి గొన్నవెలిపట్టు జన్నిదంబులతోడ రత్నాలతారహారము ధరించి
వలిపనీర్కావిదోవతిపైఁ బదార్వన్నెకళ యైనపసిఁడిమేఖల ఘటించి
గంగమట్టియమీఁదఁ గస్తూరిరసమునఁ బుండ్రకంబు లలాటమున నమర్చి
కమలకర్ణిక కుండలములపార్శ్వములందు లలితంబు లగుపోఁగు లలవరించి
యాత్మవంశపరంపరాయాతమైన, వైదికాచారమార్గంబు వక్కరించి
యారజము రాచఱికమును నలవరించి, నగరివీథులఁ జరియించుఁ బ్రెగడసుతుఁడు.

గీ. సచివనందను కర్ణపాశముల వ్రేలు, కుండలంబులముత్యాలగుళిక లొప్పు
నన్యలోకస్థుఁ డగుశంబరారి కేచ్చు,రతిమహాదేవియశ్రుపూరములువోలె. 91

క. కుసుమాయుధనిభుఁ డగు నా, రసికునిపై వ్రాలు సానురాగముతోడన్
బిసరుహనయనలచూపులు, భసలంబులు పూవుఁదోఁటపయి వ్రాలుగతిన్.92

గీ. భావ మభిరామరూపైకపాతకంబు
యౌవనము దోషముల కెల్ల నాస్పదంబు
మన్మథుఁడు కోపి యెటు నియమంబు నిలుచు
సుదతులకు వానిఁ గడకంటఁ జూచినపుడు. 93

సీ. హృదయ ముప్పొల్లూర నేకాంతమున నుండి వానిఁ జింతింపని వనజముఖియు
నొకమాఱతనిఁ జూచి యొండొకపరి చూడ నభిలషింపనివిద్రుమాధరియును
గలలోన వానిఁ జికరఁగఁ గౌఁగిటను జేర్చి ముకుళితేక్షణగానిముద్దియయును
నతనిరూపంబుఁ గుడ్యంబులందు లిఖించి యందంబుఁ జూడనియంగనయును
జెలులచేతను బ్రోదిరాచిలుకచేత, వానిగుణములు విని కుచద్వంద్వసీమఁ
బాదుకోఁ బులకింపనిపైదలియును, బన్నిదము వేసినను లేదు పట్టనమున.94

సీ. ద్యూతకేళియ వినోదోపాయమయ్యెను బరదారగమనంబ ప్రౌఢియయ్యె
నాత్మభార్యాపరిత్యాగంబు ధృతియయ్యెఁ జేలవిహారంబు నేమమయ్యె
గురుతిరస్కారంబు గరిమ మయ్యెను నటవిటకీర్తనంబులు పటిమమయ్యెఁ

బానంబె యధ్యాత్మపరత యయ్యె నమస్తతరలతాగతియ యాత్మాహమయ్యె
గుణములకు నెల్ల దోషంబు గుణము నయ్యె
నపుడు సుకుమారునకుఁ దద్వయస్యులకును
నాదిగ శ్రైశ్వరత్వంబు యావనంబు
నవుర ధనమును జనవు హేతువులు గాఁగ. 95

గీ. తమ్మమానుష కార్యోచితంబు లైన,కీర్తనలుసేయ మై పులకించుకొంద్రు
తా రమర్త్యులుగా మదిఁ దలఁతు రహహ,వి త్తమదమత్తచిత్తులై వెఱ్ఱిజనులు.

సీ. అయ్య నీవు చతుర్భుజావతారుఁడ వన్నఁ దమభుజాదండపార్శ్వములఁజూతు
రయ్య నీవు త్రిలోచనావతారుఁడవన్న ఫాలమంటుచు గురు దోఃపల్లవమున
నయ్య నీవు గజాననావతారుఁడ వన్నఁ గుంభవీథము లంటికొనఁ దలంతు
రయ్య నీవు చరాచరావతారుఁడ వన్న నందంబుఁ జూడంగ నభిలషింతు
రవసరంబిచ్చుట యనుగ్రహంబు గాఁగ
మోముఁజూచుట యుపకారముగను బలుకు
మైత్రిగా నవ్వు డధికతరార్థముగఁ ద
లంతు రైశ్వర్యమదబలవంతు లుబ్బి. 97

ఉ. సంపదపేరి కట్టిడిపిశాచము సోఁకినమానవుండు పూ
జింపఁ డభీష్టదేవత భజింపఁడు సజ్జను లైనవారి మ
న్నింపఁడు మిత్రబంధుల గణింపఁడు ధర్మరహస్యముల్ విచా
రింపఁడు మీఁ...... భరింపఁ డహంకరణంబు పెంపునన్. 98

గీ. ఉద్ధతుం డయి సుకుమారుఁ డుండలేక, వీటఁ జక్కనిజవరాలి వెదకి వెదకి
వలపు పుట్టించి సంకేతములకుఁ దార్చి,సలుపు రతికేలి బహుళవత్సరంబు రేలు.99

గీ. పద్మనాభుండు మదనగోపాలమూర్తి, ఘోషమున నెట్లువలపించె గొల్లసతుల
నట్టుకొని యట్లువింధ్యాద్రిపట్టనమునఁ,బరపురంధ్రులవలపించుబ్రాహ్మణుండు.

సీ. యమునానదీసైకతమున జాలరికన్యచనుదోయి నంటఁడే శక్తిసుతుఁడు
నందవ్రజంబులో నలిననాభుం డెట్లు విహరించెఁ బదియాఱువేలసతుల
దేవదారువనంబులో విరూపాక్షుండు మునిభామినుల నెట్లు మోసపుచ్చెఁ
గొక్కొరోకో యని కోడియై యెలుఁగించియమరనాయకుఁడెట్లహల్యఁ గలసె
ములకచన్నుల పాయంపుముద్దుఁగూఁతుఁ, బట్టుకొననెట్లుపైకొనిపద్మభవుఁడు
చంద్రుఁడుం డెట్లు వొందెనాచార్యు లేమ,ననుచువిప్రుండురమియించు నన్యసతుల.

సీ. సంధ్యాభివందనశ్రద్ధ యుద్వాసించె గాయత్రి దవ్వులఁ గట్టిపెట్టె
నగ్నిహోత్రమునీఁదియాస నుత్పాటించె నఘమర్షణస్నాన మరసి మాపె
నిహపరసామగ్రి నీయఁ జాలెడునట్టివిధి దేవతార్చన వీటఁబుచ్చె
వేదపాఠము మాని వివిధసత్కర్మాది సత్కలాపంబులు జాఱవిడిచెఁ
దనకు మరగినవారసుందరవనితల, నిరతసల్లాపసంభోగనిపుణతాను
ఖానురాగనిమగ్నుతయజ్ఞకర్మ, మైతనర్చెను సుకుమారుఁడవనిసురుఁడు.(?)102

వ. ఇవ్విధంబునఁ గుమారుండు విహరింపం జూచి. 103

క. ప్రేమమునఁ గూర్మిసుతునకు, వేమఱు సద్బుద్ధి చెప్ప వినమికి వగచుఁ
సామగ్ర్యదుర్గుణాళిక, దామధురత యొసఁగు విషమమగు చలమునకుఁ. 104

గీ. జవ్వనములును సదుపదేశములు గావు, తిల..........లంబు తెఱఁగు దోఁప
శంబరారాతిపుష్పాస్త్రసంప్రహార, జర్జరీభూత మగుమనస్సంపుటమున. 105

వ. తండ్రి గురూపదేశం బఖిలమలప్రక్షాళనక్షమం బైనతీర్థస్నానంబు, జరామర
ణవైకల్యంబు లేనివార్ధకంబు, మేదోభారంబు లేనిగౌరవంబు, సువర్ణరచన
లేనికర్ణాభరణంబు, నుద్వేగంబు లేనిప్రజాగరంబు. ఇది యభవ్యులకు
సలిలంబునుం బోలెఁ గర్ణస్థితం బై యుపద్రవంబు నాపాదించు. నీవిటవట్టి
నెట్టుకొని పెద్దలమాట వినుము, వింటేని ధూర్తులు నిన్నుఁ బ్రశంసింపలేరు,
కుటిలులు ని న్నలమరింపలేరు, వంచకులు నిన్ను వంచింపలేరు, పల్లవులు
నిన్ను వలపింపలేరు; మదంబు నిన్నుఁ గదల్పలేదు, విషయంబు నిన్ను నా
శ్లేషింపలేదు, విను మనూచానాచారంబును, నాముష్యాయణంబును, నామేధి
తామ్నాయంబును, నధీతాశేషశాస్త్రంబును, నలింగవృత్తియు, ననపకీర్ణం
బు, ననభ్యుదితంబును, ననభిస్తుతంబును, నైనయార్యావరవరవశంబునం
బ్రభవించినాఁడవు మూఢుండవై యనుష్ఠానబంధంబు లగువిషయోపభోగం
బులయందును సుఖబుద్ధి యారోపించెదవు. నీయట్టిదుర్బుద్ధిశీలురు గదా నిస్త్రిం
శంబుఁ జూచి కువలయమాల యనియును గృష్ణసర్పంబు వీక్షించి కాలాగు
రుధూమరేఖ యనియును నంగారంబు దరిసించి బంగారం బనియును
భ్రాంతిఁ బొందుదురు. దుందుమారకరుండు, మాంధాతృనహుషనాభాగసన్ని
భుండు, వింధ్యాచలపతి, హేమాంగదుండు మనల గురుస్థానంబుగా మన్నిం
చుచున్నవాఁడు. మనవంశంబునకు నీవొక్కండవ సంతానబీజంబ వింతయు
నెఱింగి బుద్ధిమంతుండవై మమ్ము నుద్ధరింపవలవదా యని పలికి మంత్రి కన్నీ
రు దొరఁగ ముహూర్తమాత్రం బూరకుండె సుశీలాదేవియు. 106

సీ. రవలయుంగరములరత్నాంకురము లొత్తఁ గేల్దమ్మి చెక్కులఁ గీలుకొల్పి
మొకరితుమ్మెద మూతిముట్ట నోడడివేఁడినిశ్వాసపవనంబు నివ్వటిలఁగ
నాకర్ణదీర్ఘంబు లగుక్రాలుఁగన్నులఁ బరిపాటలచ్ఛాయ పల్లవింపఁ
గంఠగోళంబు గద్గదికానుబద్ధ మై బాష్పభారంబు నిబ్బరము గాఁగఁ
బక్ష్మములఁ జాఱి గండదర్పణము లొరసి, క్రాలి పాలిండ్లపై నశ్రువాఃకణములు
హారలతలకు నాతిథ్య మాచరింప, గుబ్బతిల నేడ్చె నత్తఱిఁ గువలయాక్షి. 107

వ. ఇవ్విధంబునఁ దల్లియుఁ దండ్రి దనకు హితోపదేశంబు చేసి తనసౌమనస్య సౌముఖ్యంబులతో దగినప్రత్యుత్తరం బీయమి నిర్వేదించుట యెఱింగి. 108

సీ. ధర్మశాస్త్రాభ్యాసతాత్పర్యమున నైన సంస్కార మెల్లారుసారుపడియె
నిరుపాధినిస్సీమనిర్నిబంధనవృత్తి గలమహాప్రతిభ యేకాటఁ గలసెఁ
బంచేంద్రియోపాయపానభూతము లైనవినయంబు లేప్రయోజనముఁ దీర్చె
నవయావనాంకురోన్నతవంశపద మైనశ్రుతివైభవము లేమిహితవుచేసెఁ
జిన్నివయసున గురులవీక్షించి నట్టి
పుణ్యవాసన నేలకో ల్పోయె మనసు
కటకటా! నందనుం డవౌకరుఁడవు నీవు
గురుల నేడ్పించుచున్నావు ఘోరముగను. 109

వ. (అనినఁ దల్లిదండ్రుల)కుఁ బ్రణామంబుచేసి యింతనుండి మీయాజ్ఞ శిరసున ధరియించి బుద్ధిమంతుఁడనై యుండెద మీరు వగవకుండుఁ డని పలికె నము చితప్రకారంబున వీడుకొనియె ననిన నటమీఁదివృత్తాంతం బెట్టిదని యడిగిన.

మ. వరశైవైకవిధానపాత్ర కవితావ్యాపారపారంగతా
స్థిరలక్ష్మీనవశారదోదయ దయాధీనాయతాలోక లో
కరమాపాదనపాదపద్మవినతక్ష్మాపాలసంశీల శ్రీ
లరతిప్రస్ఫుటశాంత శాంతనవకల్పావీర వీరాగ్రణీ! 111

కం. ధీమత్కవితావిస్తర, ధామాయితనిరుపమానదానా యసుహృ
ద్భీమ జితోత్కలసీమా, రామామన్మథవిశేషరాజితమూర్తీ! 112

పృథ్వి. లింగార్చనారూఢిలీలావతారా, గంగార్ఘురస్వచ్ఛకావ్యైకజాలా
సంగీతసాహిత్యసాహిత్యలోలా, శృంగారసద్భక్తసేవానుహేలా. 118

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్రమారయామాత్యపుత్త్ర
సకలవిద్యాసనాథశ్రీనాథనామధేయ ప్రణీతంబయిన
శివరాత్రిమాహాత్మ్యంబునందు
ద్వితీయాశ్వాసము.

# ద్రావిడాంధ్రభాషల యన్యోన్యసంబంధము.

(మధురసభలోఁ జదువఁబడినది.)

శ్రీమదాంధ్రసాహిత్యమహాపరిషత్తను నీచదువరులచేఁ గైసేయఁబడియుండు నీయొడ్డోలగంబున వావా దొసర్చుటకు నే నియ్యకొన్న కర్జము తెలుఁగుబాసకుం దమిళమునకుం గలయొండొంటియూవటమును గుఱించినది. ఈ యంటిన నుగ్గడించుటకు బాసటగాఁ దొలుదొల్త నీ తెలుఁగుతమిళముల గారవము నొకింత వెల్లడించి పిదప నీరెంటికిం గలనెయ్యంపుటారిమను వాకొనియెదను.

తే.గీ. సంస్కృతము ప్రాకృతంబును శౌరసేని
జగతిపై మాగధియును పైశాచికయును
చూళికయు నపభ్రంశంబు సారిది నాంధ్ర
భాషయును నివి జను నష్టభాషలనఁగ.

అని యప్పకవివరుండు వక్కాణించిన

1. సంస్కృతము. 4. మాగధి. 7. అపభ్రంశము.
2. ప్రాకృతము. 5. పైశాచి. 8. ఆంధ్రము.
3. శౌరసేని. 6. చూళిక.

అను నీబాస లెనిమిదింటిలో నొకటియుఁ, దమిళము, తెలుఁగు, కన్నడము, మరాటి, గుజ్జరులను పంచద్రావిడములలో నొకటియు నైన తెలుఁగుబాస, యీజగంబునం దసువులు నివ్వటిలంగఁడఁగిన సావియైన యేనూఱులక్షలయేండ్ల నైదుపాళ్లుగాఁ బంచి, యందు నాల్గవపాలినడుమఁ గ్రోఁతులును, వెంబడి మానిసులు నామతిల్లి నైదవపాలిమొదటనే, యనఁగా, రెండులక్షలయేఁబదివేలేండ్లక్రిందట మానిసులు దమతమ యెడఁదం బొడమినతలంపుల రవళిచేతను, సన్నలచేతను లాఁతుల కెఱింగించుచుండిరి. పిదపఁ దరతరముగా నట్టిచప్పుడులను, గొందఱు తవరలు గొన్నికట్టడలచేఁ బలుకులుగా నవరించుటవలన మానిసు లొండొరులు ముచ్చటించుటకును, వలసినతావులకు విచ్చలవిడిఁ గ్రిమ్మరుటకును దలఁపెట్టిరి.

ఈనేఁటి నడిమికు వలకడ చందాదీవులు మొదల్కొని మెడగాస్కరు వఱకు మునుఁగుకొని యేనువేలమైళ్ల వెడలుపు గలపుడమి యైన "లెమూరియా"

నేలయందుఁ దొలుత మానిసులు గండరించి నుడువు లాడుటకు దొరకొనిరి. ఇట్లు వక్కాణింపఁ గొనకొన్నవార లించుమించుగా నేఁబదివేలేండ్లక్రిందటఁ గొంతనాణెయములును, నేరిమియు నలవడి నేఁటికిరువదివేలేండ్లదొట్టి చదువను వ్రాయను నేర్చుకొనిరి. ఈలెమూరియానాటం బొడమి మొట్టమొదట మానిసులనోటఁ బలుకరింపఁబడి చదువను వ్రాయను నేర్పఁబడిన బాస తమిళమే యని పలువురు నియ్యకొనియున్నారు. ఈలెమూరియా నేలయే తమిళహాం లేక ద్రావిడదేశం బనంజెలంగును. ఈతమిళముయొక్క మఱియొకరూ నిలువైన కొడుందమిళ్ అనఁగా వర్ణలోపాగమాదేశాదులచే వెకురింపఁబడిన తమిళముయొక్క వికృతియై, తమిళహాముం జుట్టువాఱి యెడమప్రక్క నుండునేలయందు నీతమిళమునకు సైదోడుగాఁ బొడసూపినయీ తెలుఁగుబాస పెద్దతడవు తమిళముతోఁ గలుపుఁగోలుగా బెడఁగారుచుండి నేఁటికి దచ్చివేలేండ్లదొట్టి పలుతేవల విచ్చలవిడిగాఁ బిసాళింపఁ దలపెట్టెను. ఈ తెలుఁగుబాస పెఱబాసలవలె లాఁతిసాయము నఁగనిమొదల రూపుమాసి చాగతించునట్టిది గాక యలికిడి రూపైన, మానిసులనోటఁ బలుకరింపఁబడు పలుకులుగాను, చాటికరూపైన వ్రాలచేఁ బొలుపొందు కబ్బంబులతోను దేశభాషారూపంబుగా జోకలేనిసొబగంది పురణించుచున్నది. ఇట్టి తెలుఁగుబాస తొలుదొల్త మోటుదనముగా వాడంబడుచుండి, యొండొండ నాణెము లలవడి, యప్పటికిఁదగినట్లు కొద్దినేమంబులతోఁ గూర్పఁబడినపాటలు పద్యంబులఁ గలిగి దైవాఱుచుండెను. ఈబాసకుఁ బెద్దతడవు లక్షణము లేవియు లేకుండి "హేమచంద్రాదిమునిభిః కథితం చాంధ్రలక్షణం" అన్నట్లు హేమచంద్రాదిమునివరులవలన లక్షణంబు లేర్పఱుపఁబడి, వీనికి నొరగల్లుగా విలసిల్లుచుండిన కబ్బంబులలోఁ బెక్కులు నీలక్షణంబులును బగతురవలన నీ తెలుఁగుదేశము గాల్పఁబడినప్పుడు ప్రాడవడంగెను. పిదపఁ బలుతెగలవారలు తెలుఁగుదేశము నేలుచుండినకతంబునఁ దెలుఁగుబాసకుఁ బలురకము లైనయనాగరకములు గలయుటంజేసి వెండియు మోటుదనము నెకొనసాగెను.

ఇటీవలఁ దెలుఁగుబాస యలజడింబడి వెంపఱలాడుచుండుతఱి, రాజరాజనరేంద్రబిరుదాంక విష్ణువర్ధనుం డనుమన్నీఁడు తెలుఁగుదేశము నేలువప్పుడు తెలుఁగుబాసకు వెండియు వన్నె యీఁగడంగి, తనయొడ్డోలగంబునఁ బలువురు చదువరుల నాదరించి వారలవలనఁ దెలుఁగుబాసలోఁ బెనఁగియుండినమోటుదనముల నూఁచముట్టుగాఁ బెఱికివైచి చొకాటంపుఁబల్కులుగాఁ జొప్పఱిచి, పలుతే

వలం గట్టడలతో నేమంబులం బాదుకొల్పి, పలు తెగలకబ్బంబులను, వ్యాకర
ణము మొదలగువాని నొనర్పించి తెలుఁగుఁబలుకులవెలఁదికిఁ దండ్రిమాఱుగాఁ
బొగడ్తవడసి పొలుపారుచుండెను. ఇట్లు తేనియానతిమెయిఁ దెలుఁగుబాసకు
లక్ష్యలక్షణరూపంబులైన కైసేఁతలచే మెఱపడిం గూర్చిపెట్టిననేరిమి ప్రథమాచా
ర్యవర్య శ్రీనన్నయభట్టారకులపాలిటిదియే యనఁనొప్పును. ఈభట్టారకులు మేర
లేని వేలుపుబాసమొకఁ పలుకులను, బోకలను, దెలుఁగుబాసలోఁ జెనఁగించి,
యందుకు మునుపు చొక్కముగా పేఁసిల్లినబాసకు గలయికనొడఁగూర్చి,
క్రొత్తనాణెములం గూర్చుటవలన బాసకుఁ జేవగలిగించి పిమ్మటివారలకు దారిఁ
దెచ్చిపెట్టెను. ఈతవరను వెంబడించియే చదువరులు పెక్కండ్రు లెక్కలేనికబ్బం
బులొనర్చి తెలుఁగుబాస నెదిగించి యెప్పటియట్ల పంచారింపఁజేసిరి.

ఇటీవలఁ దరతరముగాఁ బొంపిరివోయి యెసఁగుచుండు తెలుఁగుఁబలుకుల
పొలఁతుక, యాంధ్రభోజుండని పొగడ్తంగాంచిన మూరురాయరగండాంకవీరశ్రీ
కృష్ణదేవరాయసమ్రాట్టువలనఁ గ్రొత్తనాణెములతోఁ జనవుసేయఁబడి విఱ్ఱవీఁగు
చు నెలజవ్వనం బందినయదనున, ఆంధ్రకవితాపితామహబిరుదాంకి తాల్లసాని
పెద్దనకవిసార్వభౌమునిచే స్వారోచిషమనుసంభవంబను సరణముతో శ్రీకృష్ణదే
వరాయరాజేంద్రుఁ జెట్టఁబట్టింపఁబడి యింపుసొంపారుచున్నయది.

పెక్కుకాలంబుగాఁ దనకుఁదాన సొంతబాసగా నంతటఁ బెంపుదలిర్పఁ
బురాయించుచున్నట్టి యీతెలుఁగుబాస ప్రథమాచార్యవర్య శ్రీనన్నయభట్టార
కులచేతఁ గ్రొత్తగానేర్పఱుపఁబడినబాస యనియు, వేలుపుబాసనుండియే నడు
మం బొడమినబాసగాని యనాదిసిద్ధమైన స్వతంత్రభాష గాదనియుఁ బలువురు
పలుతీరుగా వాకొనుట లెంతనమ్మఁదగినవో యనుటను గొంత దడవిచూతము.

క్రీస్తుశకము 1022 మొదలు 1063 వఱకు రాజ్యమేలినరాజరాజనరేంద్రు
నికాలమునం దతని యాస్థానప్రథమపండితులుగా నన్నయభట్టారకులుండియున్నట్లు
తెలియఁబడుచున్నది. కావున నేఁటికిఁ దొమ్మిదవశతాబ్దకాలమందు బొడమినబాస
యనిగదా తేలుచున్నది! ఇదిగాక యితనికిమునుపు తెలుఁగుపలుకులుఁ, దెలుఁగు
చదువరులును, దెలుఁగుఁగబ్బంబులును గలిగియుండలేవనియుఁగదా కొందఱు తే
లికగా నుడువుచున్నారు. ఇట్టినానుడి యసంబంధాతిశయోక్త్యలంకారమునకే ల
క్ష్యముగాఁ జెప్పనొప్పును. పలయన, వీనికాలంబు నారసిచూచినయెడల, అలెక్సాం
డర్ది గ్రేట్ అనుఘ్రించినాఁడు క్రీస్తుపూర్వము 320 సంవత్సరములో హిందూదే

శంబున కరుగుదెంచినప్పు డుండినవందునికొడు కగుచంద్రగుప్తుఁడు మౌర్యవంశ జాతుఁడనియు, మురయనునాంధ్రస్త్రీయందు నందునికిఁ బుట్టినందున మౌర్య వంశజాతుఁడని నుడువంబడినాఁడనియు, గ్రీకులు, పారసీకులు, మొదలగువారల తోఁ గయ్యంబున నెదుర్కొన్న, చంద్రసారునికొడుకగు, పులోముఁ డాంధ్ర వంశరాజులలోఁ గడపటివాఁడనియుఁ గ్రీస్తుపూర్వము 230 వత్సరమునుండి యాం ధ్రులు తమస్వాధీనతం గైకొని యాంధ్రదేశము నేలుచుండిరనియుఁ బాశ్చాత్యు లగు దేశచరిత్రకారులు మందలించుచున్నారు. మఱియుఁ దృతీయద్రావిడసంఘ కాలమందుఁ బాండ్యునికొఱకు ముక్కంటిచే వ్రాయఁబడిన "ఇఱయనారహ ప్పొరుళ్" అనుద్రావిడభాషాలక్షణకావ్యమందు

"మురణ్మిహు వడుహార్ ఎయిన్ను అమోరియర్
తెన్నిశై మాదిర మున్నియ వరవిర్కు
విణ్ణుఱవోఙ్గియ పన్నిరుఙ్గుణ
త్తొణ్కదిర్తిహిరి యురుణియ కుఱైత్త."

"యాంధ్రుల (వడుహార్) ముందిడుకొని దక్షిణంబునకు మూఁగుల రాకకు" అని నుడివియుండుటలో నాంధ్రుల నత్త్వంబుగొలఁదిఁ బేర్కొనియుండుటవల్లను రెండుమూఁడువేలేండ్లకాలమునకు మునుపే తెలుఁగువారలు ప్రోడలై తవణిల్లు చుండినట్లు తెలియఁబడుచున్నది.

మఱియు నీభట్టారకులు తెలుఁగుబాసకు వ్యాకరణముఁ దెలుఁగునంగాక యార్యభాషయందు నెనుబదిరెండార్యలతో నొనర్చినట్లు వాడంబడు "ఆంధ్రశబ్ద చింతామణి" యు నితనిదే యగునెడల నితనికి మునుపు కబ్బంబులును, జదువ రులు నుండిరయే తీరవలయు ననుట నిక్కమగుచున్నది.

ప్రక్రియాకౌముది సంధిపరిచ్ఛేదమునందుఁ బదమధ్య న-ర-ల-డలయొక్క కొమ్ములకు లోపంబు సెప్పునెడల

"పదమధ్యనరలడానా ముతశ్చ పూర్వప్రయోగసిద్ధానాం
లోపో వాస్యాత్ తేషాం మితశ్చ తద్వ త్త్రివిక్రమమతేన" అనియు
"కవిభల్లటైః క్రియాణాం నామ్నా ముల్లోప ఇష్యతే హ్యేషు" అనియు
పుంపు వర్ణాదేశముం జెప్పుచో

"తస్యసమాసే పుంపూ నుమ్యో తో హల్యధర్వణాచార్యమతాత్" అనియుఁ దనకు వెనుకటివారలైన త్రివిక్రమ, కవిభల్లటాదులను, దనసమకాలీనుఁ డైన

యధర్వణాచార్యులను దాఁ జేర్కొనియుండుటం జేసి యితనికిఁ బూర్వము నితని కాలమందును ద్రివిక్రమకవిభల్లటాదులును, వేములవాడ భీమకవి యధర్వణాచార్యులు నుండియున్నట్లు దోఁపఁడుచున్నయది.

గీ. "ఆంధ్రశబ్దచింతామణి వ్యాకరణము
ముందు రచియించి తత్సూత్రములఁ దెనుంగు
బాసచేఁ జెప్పె నన్నయభట్టు తొల్లి
పర్వములు మూఁడు శ్రీమహాభారతమున" అని యాంధ్రభాషకుఁ

దొలుత లక్షణంబును, బిదప లక్ష్యముం జెప్పిన ట్లప్పకవివరుండు వెల్లడించియుండుటను గమనించిన నో, మిక్కిలి వింతలు వొడముచున్నవి. లక్ష్యంబులకు లక్షణం బొనర్పఁబడుటయే సహజముగాని లక్షణములకొఱకు లక్ష్యంబు లొనర్పఁబడుట కంటనమైన మిథ్యాధ్యవసితియే యగును. కావున మును పొకప్పుడును లక్ష్యంబు లేర్పడకయే యుండినఁ దేనిపొంటె లక్షణము లేర్పడనోవు? ఎద్దియేని లక్ష్యంబులుండి వానిఁ బట్టియే లక్షణములు సేయుటకు వీలుపడును. కనుక నితనికి మునువు తెలుఁగుపల్కులును, గబ్బంబులును నిక్కువముగా నుండియుండ వచ్చు ననియే కనఁబడుచున్నది.

ఈచందంబున నేఁటి, కెనిమిదివేలేండ్లనుండియే యీతెలుఁగుబాసకు నాణెములును, జదువరులును, గబ్బంబులును జొప్పడియుండ, నడుమఁ దురకలు మొదలగులాఁతితేండ్లవలన నీతెలుఁగుదేశము గాల్పఁబడినందునఁ గబ్బంబులలోఁ బెక్కులు చొగంటివాతం బడి యొలమాసగొనియెను. ఇందువలననే తెలుఁగు నాడు వేఁగినాడని యిప్పటికినిఁ బిలువఁబడుచున్నది. అట్లు కానియెడల, వెనుకటికాలంబున నెప్పటికైన నుండియుండలేని యొకబాసనుఁ గ్రొత్తగాఁ బుట్టించి యందున నేపాటియొచ్చెంబును లేక, జోకలేని చవి గులుకులక్షణవంతమైన కబ్బంబొనర్పుటకుఁ దమ్మిచూలికైన నలవి గాదని యందఱకుఁ దోఁపకుండదు.

అయిన నప్పటికవిత్వము లిప్పటియట్లు పలుతెగలు గలవిగాను, మిక్కుటంపునేమములు గలవిగాను, జాణతఁ బిసాళించునవిగాను, బెనుఁ దెఱంగు లగు కైసేఁతలచే నొప్పినవియుఁ గాఁ దుఱంగలించుచుండె ననివాకొనుట కొక్కింత వీలులేకుండినను, ఇప్పటి బొబ్బిలిపాటలును తందనపాటలు, చెంచుపాటలు, ద్విపదలు, రగడలుం బోలినకొద్దినేమంబులతోఁ జేరినపాటలు పద్యములుఁ జాలినంత వఱకు వెలుఁగొందుచుండె ననుట కెవ్వరునియ్యకొనక తీరదు, అటులయిన,

నడుమ నాగరకతకు నించుక యెడమడువు వొడమినందుకుఁ గతంబే మని యూర సిచూడ నీతెలుఁగు దేశము నేలుచుండినవారలు పైశాచ్యపభ్రంశంబులు పలుకు నట్టికిరాతులును. నిశాటులుఁగా నుండినందున నప్పుడు నాగరకతకు నలజడి దాపరించి యించుక మోటుదనము గదిరియుండవచ్చు నని పలువురు దలపోయుచున్నారు.

ఇట్టికారణముల నిసుమంతయు నారయఁజాలక వారివారియెడఁదం బొడమినచందంబున నీతెలుఁగుబాస స్వతంత్రభాష గాదనియు, ఆంధ్ర-శ-చిం, సం-పరి, సూ 12. ఆద్యః ప్రకృతిః ప్రకృతిశ్చాద్యే ఏషా తయోర్భవే ద్వికృతిః. అనుసూత్రమునవలంబించి సంస్కృతప్రాకృతభాషలయొక్క వికృతి యనియు,

మ. "మహి మున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు ద
న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపువాటిల్లు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్." అని

రామరాజభూషణుఁడు తనవసుచరిత్రములో నాంధ్రశబ్దమయప్రబంధమునకును విశ్వంబునకును శ్లేషార్థంబుగా రచియించినపద్యముయొక్క తొలిపాదమును మాత్రము దిలకించి యందలి తురీయపాదమునంగల "బహుళాంధ్రోక్తిమయప్రపంచము" ననెడివాక్యంబునం గల "విస్తారములయిన తెలుఁగుఁబలుకుల స్వరూపముచే నైన ప్రపంచ మనెడికావ్యమును గ్రొత్తగా నొనర్చె" నని తేలెడి యర్థముం గమనింపక నన్నయభట్టారకుచే తెనుఁగుబాసను సృజించెననియుఁ గొందఱు ఉజ్జగొనుచున్నారు. ఇట్టివారలు క్రింద నుదాహరింపఁబడినసూత్రముయొక్క "ఏషా తయోర్భవే ద్వికృతిః" అనెడియుత్తరార్థముయొక్క భావము,—ఏషా=ఈయాంధ్రభాష (అనఁగా నాంధ్రంబులోవాడంబడు తద్భవతత్సమములు), తయోః=ఆసంస్కృతప్రాకృతములయొక్క, వికృతిః=వికారము, భవేత్=అగును. (అనఁగా నీయాంధ్రభాషలోఁజేరిన తద్భవతత్సమములు సంస్కృతప్రాకృతములవలనఁ బుట్టినవి.) అని బాలసరస్వతులు విశదీకరించినతాత్పర్యమువలనఁ దద్భవతత్సమములు దప్పఁ దక్కిన దేశ్యగ్రామ్యంబులైనయచ్చతెలుఁగు వికృతికాఁజాలదని తేలుచున్నయర్థంబును, మఱియు దాచిన

"కేవలతయానుసృష్ట్యా భేద యేయం యథాతథా భాషా." అనుసూత్రమువలన, "సంస్కృతప్రాకృతంబులెట్లో యట్లీయాంధ్రభాషయుఁ బృథగ్భావమున

వర్తిల్లుచుఁ దద్భవతత్సమంబులచే సంస్కృతప్రాకృతముల ననుసరించుచున్నది" యనుతాత్పర్యంబులసయితము గమనింపలేకపోయిరి. వారలు గమనింపక పోయినను, జేకునకు మిన్నులవన్నె యగ్గముగాకున్నఁ జూపఱ కెంతో సొబగుగా నగ్గమగుచందంబునఁ గ్రింద నుదాహరింపఁబడినసూత్రములచే నీతెలుఁగుబాస స్వతంత్రభాషయనియే సిద్ధమగుచున్నది.

అట్లు స్వతస్సిద్ధముగాఁ బ్రవర్తిల్లునీతెలుఁగుబాస మానవుల నోటఁ దొలుదొల్తఁ బలుకరింపఁబడినతమిళమునకు డాచినబాసగా బెడఁగొందుచు, ఆం, శ, చిం, సంజ్ఞా.ప.సూ. 6 "సిద్ధిర్లోకాద్బ్రశ్యా" అనుసూత్రముచే నీయాంధ్రశబ్ద స్వరూపము లోకవ్యవహారమువలన సిద్ధించుచున్నదియనియు, "లోకోఽనన్యా దృశశ్చనిత్యశ్చ" అనుసూత్రమువలన "నట్టిలోకవ్యవహార మెల్లకాలంబును నేకరీతిగా నవిచ్ఛిన్నంబై యుండునది" యనియెడితాత్పర్యంబులంబట్టి యుజ్జగొన్నచో నీయాంధ్రభాష మధ్యనొకరివల్లఁ గల్పింపఁబడినది గాక మానిసులు మాటలాడఁదలపెట్టినది మొదలు సుభాషితమై దేశభాషారూపముగా వ్యవహరింపఁబడునట్టి యనాదిసిద్ధ మైనస్వతంత్రభాష యనియే చక్కఁగ బోధపడుచున్నది.

లేకున్న నెంతయో పెద్దతడవునుండి తనంతట వెలుఁగొందుచుండునది యు, నొకకొన్ని మందిజనులచేతఁ గాదు, ఈహిందూదేశములో రమారమి మూఁడుకోట్లజనులచేఁ బలుకఁబడునదియు నైనయీయాంధ్రభాష తొమ్మిదివందల యేండ్లతరువాయి నుండినయొక్కనన్నయభట్టారకులవలన డబ్బాటుగా నొనర్పఁబడి, యంతవైశముగా వ్యాపింపఁబడె నన్నసుద్ది నాలకించుటకు ద్రావిడజాతి యందుఁ బాటిల్లి తెలుఁగుబాసం జదువుకొన్న నావంటివానికే వెక్కసముచే వినుగుగదురుచున్నది.

ఇంతటిగాగాము వడసినయీతెలుఁగుబాస ద్రావిడదేశమునకు డాచిన యుత్తరదిగ్దేశమునందు వ్యాపించియుండుటంజేసి ద్రావిడులు వడువాు, వడుహాం అనియు, మహాశైవక్షేత్రము లైనమహాకాళేశ్వర, దాక్షారామ, శ్రీశైలములందు నెలకొని విలసిల్లు శ్రీకాళహస్తి భీమేశ్వర మల్లికార్జునలింగములను ద్రిలింగముల మధ్యగతదేశమందు వ్యాపించియుండుటంబట్టి త్రిలింగభాష (తెలుఁగుబాస) యనియు నుగ్గడింపఁబడుచున్నయది.

ద్రావిడమధ్యసంఘము లెమూరియాలోని కవాటపురమునందు స్థాపింపఁబడినకాల మైనయెనిమిదివేలేండ్లకుఁ బూర్వమునుండియే యీతెలుఁగుఁబలుకు

దనకలవడియుండు పేరునలనను, వ్యాపించియుండు త్రిలింగమధ్యగత దేశనామంబు వలనను జగంబునం గలభాషలన్నింటికంటె నెక్కు డుగౌరవము నందియుండుకతంబున నానిండారుమచ్చుతో నీత్రిలింగభాషను మహాశైవభాష యగుదివ్యభాష యనియే వేనోళ్లఁ గొనియాడుదును.

ఇప్పటి క్రిలింగభాష యార్యులచేత మలవడినపిదప శ్రీనన్నయభట్టారకులకాలమునందుండియే సంస్కృతపదసాంకర్యమును, కేవలసాంస్కృతిక దీర్ఘ సమాసములును, బెక్కుచోట్లఁ గ్రియాంతములు, విభక్తివర్ణకములు దప్పఁ దక్కినవన్నియు సంస్కృతపదజటిలములుగా నులసిల్లి నూటికిరువదియంతు సయితము తెలుఁగుపదములుగాఁ గానంబడుటయు నరుదై తఱచుగా సంస్కృతపదభూయిష్ఠమై వెలరారుచున్నది. మఱియుఁ, గవిత్వశైలి, ప్రాసయతులు దియమకవైచిత్రియు, నర్థాలంకార శబ్దాలంకార నైపుణియుఁ, జిత్రబంధగర్భకవిత్వచమత్కృతియుఁ, బ్రాధాన్యములు, స్వరూపములు. శయ్య, పాకములు, నర్థవృత్తులు, ధ్వని, కావ్యవృత్తులు, కావ్యరీతులు, నౌదార్యాదిప్రాణదశకౌచిత్యమును, రసానురూపరచనాసారస్యమును, నిరోష్ఠ్యశ్లేషాదిపదగుంఫనంబులచే నలంకరింపఁబడిన నిరుపమాన మధురవాఙ్మయ మాధురీధురీణమానసోల్లాసకర కవిత్వంబులచే శ్రోతల నితాంతసంతోషపారావారలోలాయమానమానసులం జేయఁజాలి గాంధర్వవిద్య కాలంబనముగాను. శ్లేషకావ్యములు, ద్వ్యర్థి, త్ర్యర్థికావ్యంబులు, నచ్చతెలుఁగుకావ్యంబులచేతను మనోజ్ఞమై విజృంభించుచు వెలరారుచుండుట పండితమండలికిఁ గరతలామలకంబ.

ఇఁక నే నింతనుండి యీ తెలుఁగుబాస నగ్గించుట నుజ్జగించి, దీనికి నైదోడైన తమిళమునుగుఱించి యుటంకముగా నొకింతచుక మందలించి వెండియు నీరెంటికిం గలనెయ్యంపుటొరిమ నుగ్గడించెదను.

తమిళము.

జీవోత్పత్తికాలప్రమాణంబైన మైదుకోట్లసంవత్సరములలో నించుమించుగా నెనిమిదిలక్షల యిరువదిమైనవేలేండ్లకు మునుపే మనుష్యు లుద్భవించిరనియు, నట్లు ప్రప్రథమమున మానవోత్పత్తి మైనప్రదేశ మీభరతఖండమునకు దక్షిణదిగ్భాగంబైన లెమూరియా నాడనియు, నీలెమూరియా దేశము సుమాత్రాద్వీపంబునుండి యాఫ్రికాఖండముదాఁక నేడువేలమైళ్లవిస్తారముగా వ్యాపించియుండిన భూభాగంబనియు, నట్టిభూభాగము తమిళహంబను నఖిలా

నంబుచే విరాజమానంబై, ద్రావిడమహీపాలురవలనఁ బరిపాలితమై, ద్వివిధం బైన ద్రావిడవిద్వత్సంఘములకు నిలయంబై, యింద్రిరామనోహరం బైన నారాయణుని మత్స్యావతారయోగ్యప్రదేశమై నెగడుచుండినది యెల్లరకుం దెల్లంబ.

ఈతమిళహామందు తెన్మధురానగరంబును రాజధానిగాఁగొని సమధికవిక్రమోపేత జగత్త్రయప్రఖ్యాత సర్వసర్వంసహారత్నాదరుఁ పాండ్యకుమారవల్లభులెనుబదితొమ్మిదితరగతులవారలు రాజ్యము సేయుచుండిరి. ఈపరంపరలలో కాయ్సినవళుది కాలమునుండి కడుంగోన్వళుది పర్యంతము నెనుబదితొమ్మిదితరగతులరల సమంచితాదరంబున ద్రావిడప్రాథమికవిద్వత్సంఘము నేఁటికిరమారమి త్రయోదశసహస్రసహాయనములనుండి ప్రారంభించి నాలుగువేలనన్నూటనలుబది యేండ్లు ప్రవర్తిల్లుచుండెను. ఈమహాసంఘములో (తిరిపురమెరిత్తవిరిసడైక్కడవుళ్) త్రిపురదహనుఁడై నజటామకుటధారియుఁ, గుమారస్వామియు, నగస్త్యులును, మురినాగర్ మొదలగు నైమవంతల నలుబదతొమ్మిదిమంది విద్వాంసులు కావ్యంబులు రచియించిరి. అప్పుడు, పరిపాడల్, ముదునారై, ముదుకురుహు, కళరియావిరై, మొదలగుజాతీయములతో నసంఖ్యాకంబు లైన కావ్యంబులు రచింపఁబడినవి. వారల కేర్పడిన లక్షణశాస్త్ర మెనుబదవేలసూత్రిముల్లతో నగస్త్యవాచంయమీంద్రులవలనఁ జేయఁబడిన పేరగస్త్యమే ప్రౌఢవ్యాకరణము. తుదకీతెన్మధుర నేఁటికి 8700 వత్సరంబున సముద్రావగాఢంబై కంచుమించాయెను.

పిదప, లెమూరియా వసిష్ఠభూభాగమందుఁ గవాటపురంబును రాజధానిగాఁగొని వెణ్ఢేర్చెళియన్ మొదలుగా ముడత్తిరుమారన్ పర్యంతము నేఁబదితొమ్మిదిమంది పాండ్యభూవరులప్రాభవంబునం ద్వితీయద్రావిడమధ్యసంఘము నేఁటికి 8000 ఏండ్లకు ముందు ప్రారంభించి యగస్త్యులు, తొల్కాప్పియనార్, ఇరుందయూర్ కరుంగోళిమోసియార్, వెళ్లూరుకాప్పియనార్, తువరైక్కోమాన్ మొదలుగాఁగల యేఁబదితొమ్మిదిమంది కవిసార్వభౌములచే నధ్యక్షతవహింపఁబడి 3700 ఏండ్లు పరిఢవిల్లి చివర కీలెమూరియాదేశము నిశ్శేషముగాఁ గడలివాతంబడి మునిఁగిపోయెను. ఈమధ్యసంఘకాలమందు 3700 కవిగ్రామణులచే కలి, కురుహు, వెణ్డాళి, వియాళమాలై, అగవల్ మొదలగు ననేక చ్ఛందోబద్ధంబులైన మహాప్రబంధంబులు విరచింపఁబడినవి. తొల్కాప్పియనార్వలన రచియింపఁబడిన తొల్కాప్పియం అనునొక గొప్పవ్యాకరణమును, పేరగత్తియ మనునొకప్రౌఢవ్యాకరణమును లక్షణగ్రంథంబులుగా పిలుసిల్లుచుండెను. ఈమధ్యసంఘముయొ

కరు తిరోధానానంతరము కవాటపురజానపదులు స్వేచ్ఛావిహారతత్పరులై ఆసియా, ఆఫ్రికా, ఐరోపా మొదలగుఖండములకు వలసతీసి వారివారి కింపగు చోట్ల బసగొన నుద్యమించిరి. ఇందువలననే తమిళపదంబులు నాలభూభాగంబులందుంగల దేశభాషలతో మిళితమైన ట్లూహింపఁబడుచున్నయవి. మనుజులచేఁ బలుకఁబడుదేశభాషగాని దైన సంస్కృతభాషయందు సయితము ద్రావిడపదములు విరళముగాఁ గలసి యుండుటయు ద్రావిడభాషాసమంజసధాతురూపంబులవలన గుర్తింపఁబడుచున్నది. విస్తరభీతిచే వాని నిచట వదలిపెట్టి వలసినతావుల నుదాహరించెదను.

ఇఁక నీయాంధ్రసాహిత్య పరిషత్ప్రథమవార్షికోత్సవసభాసమావేశంబునకు భవ్యనికేతనంబును, సుస్తరసంసారవారిధి నిమగ్న సేవకోత్తారణచణనాకికోత్తముండును, శ్రీమత్తటాతకాదేవీ పాణిగ్రహణోత్సాహపూరిత హృదయారవిందసౌందర్యక్షమాధీశ్వరుండు నైనపరమేశ్వరుని

సీ. కపటచతుష్షష్టిగతులనాడినయాటనాయిచోక్కేశునివాసభూమి
యతనిపట్టపుదేవి యైనమీనాక్షిణాధరతనూభవకుఁ బ్రధానగృహము
ద్రవిడభాషాపీఠతలశంఖఫలకంబు గలకనకాబ్జపుష్కరిణికిరవు
దక్షిణాంబుధివధూతామ్రపర్ణినదీనవతునైఘకునెన్నఁజాలునునికి
నిజదృగబ్జప్రసన్నపూజితనీలకంఠ, కాండలళఘనమైకు తకుంఠితాను
నిఖిలసంపత్ప్రరంపరానిహితకింప, చానుతాపంబు మధురాభిధానపురము.

అట్టిమధురానగరంబును రాజధానిగాఁగొని, మునుపు సముద్రావగాఢంబైన కవాటపురంబు నేలినముడత్తిరుమారుపాండ్యధాత్రీశ్వరుఁ డాదిగా నుగ్రప్పెరువళుదిపర్యంతముఁ గలనలుబదితొమ్మిదిమంది పాండ్యవసుంధరాధీశులు రాజ్యపరిపాలనము సేయుచుండిరి. ఈముడత్తిరుమారుని కాలమందు మూఁడవది యైనద్రావిడాంత్యసంఘము నేఁటికి 3768 సంవత్సరంబున నుపక్రమింపఁబడి చిఱుమేధావియార్, సేందంభూతనార్, అఱివుడియరనార్, నక్కీరు మొదలగునలుబదితొమ్మిదిమంది కవికేసరులయధ్యక్షతకు లోఁబడి 1870 యేండ్లవఱకు నివ్వటిల్లుచుండెను. ఈకాలంబున నగస్త్యము, తొల్కాప్పియము, ఇఱైయనారహప్పొరుళ్ అను నీమూఁడును లక్షణశాస్త్రములుగాఁ దనరుచుండెను. ఈయంత్యసంఘకాలమందు నెడున్దొహై 400, కుఱుందొహై 400, నట్రిణై 400, పదిట్రుప్పత్తు, కలి 150, పరిపాడల్ 70, గాంధర్వికలమైన కూత్తు, వరి, పేరిసై, సిట్రిసై మొదలగుకావ్యంబు

లన్యభాషాసాంకర్యం బీషన్మాత్రంబు నంగీకరింపలేక శుద్ధద్రావిడోక్తిమయమై విద్వ
ద్వరుల పెన్నిధానముపోలె నిప్పటికిని దుఱంగలించుచున్నవి. ఇందునఁ దొల్కా
ప్పియరనుమునివరునిచే విరచింపఁబడిన తొల్కాప్పియ మను వ్యాకరణశాస్త్ర
మేతత్కాలంబున ద్రావిడవిద్వజ్జనహృదయభవనోద్దీపితరత్నకలికవోలె దేదీ
ప్యమానంబై ద్రావిడప్రపంచంబును వెలిఁగించుచున్నయది.

ఈయంత్యసంఘకాలముచివర నధ్యక్షతవహించి పొట్రామన్రై యనుది
వ్యకవన కాబ్జపుష్కరిణిలో నగస్త్యమహర్షులవారిచే నొసంగఁబడిన

క. ద్రావిడభాషాదేవీ, గ్రైవేయక మనఁగఁ గీర్తిఁ గని తత్కవితా
శ్రీవిపులశంఖఫలకము పై వసియింపంగఁ దగు విభాసితమతులన్.

శంఖఫలకంబున నధివసించుచు వాసి గన్న నక్కీరకవికులసార్వభౌముఁడు, శ్రీమ
త్పరమేశ్వరుఁడు తనభక్తాగ్రేసరుం డైన నొకమూలస్థానహరిద్విజునినిప్పచ్చరముఁ
గసిమసఁగింపఁ దలపోసి చంపకమాలి పాండ్యభూపాలునిమీఁద శృంగారరసాను
బద్ధంబుగా నొకద్రావిడపద్యము రచియించి తద్విప్రునికొసంగి పుత్తెంచినంతట
నాపాఱుఁడు తేనికి నాపద్యంబు సమర్పించి యతనియానతిమెయి, వేయిమాడల
తో నిండిన, పుత్తడిముడుపునందు తరవాయిఁ బద్యముపొరపాటు గలది గావు
నం బుత్తడిముడుపు న్నట్టవలదని నక్కీరుఁడు తటాయింప నానెవ్వంపుజన్నిగట్ట
దవదపడి శ్రీమీనాక్షీసుందరేశ్వరసన్నిధిని దన వెతాపముఁ గనికరముతో
విన్నవింపఁగా నాయాపద్బాంధవుండు బైడాలము రెక్కినఁ గైసెవవిద్వాంసు
నిగాఁ బ్రామినుకులపావలు పాటించి తేనిమోలగంబునకు విచ్చేసి

శా. ఈరాజన్యునిమీఁద నేఁ గవిత సాహిత్యస్ఫురన్మాధురీ
చారుప్రౌఢిమఁ జెప్పి పంప విని మాత్సర్యంబు వాటించి న
క్కీరుం డూరక తప్పవట్టెనఁట యేదీ లక్షణంబో యలం
కారంబో పదబద్ధమో రసమొ చక్కం జెప్పుఁడా తప్పగన్.

నక్కీరుఁడు, లక్షణాలంకారపదబద్ధములన్నియు మనోజ్ఞమైనను రసమొక్కటియ యొచ్చెంబని
బెగడుడిగి నుడువఁగాఁ బరమేశ్వరుఁడు రసంబున కేపాటియొచ్చెం బనియడిగెను.
యువతీశిరోజములకు సహజగంధముఁ గల్పించినరసభంగమే యని నక్కీరుఁడు
ప్రత్యుత్తరమిచ్చెను. పద్మినీజాతియంగనలకైనను, భవదుపాసనామూర్తి యగు
శ్రీకాళహస్తీశ్వరుని యర్ధాంగి యైనజ్ఞానప్రసూనాంబికకు నైనఁ గలుగదా
యని చంద్రార్ధశేఖరుఁ డడిగిన నెంతయు జంకులేక నెవ్వరికిని లేదని మోటుదన

ముగాఁ బల్కిన నక్కీరునికిం దననిజస్వరూపమ్ముం జూపఁదలంచి తనమూఁడవది యైనఫాలలోచనముఁ గనిపించెను. అప్పుడు,

క. తలచుట్టువాఱఁ గన్నులు, గలిగినఁ బద్యంబు దప్పు గాదనవశమే
వలదిచ్చట నీమాయా, విలసనములు పనికిరావు విడువుమటన్నన్. అని నక్కీరుఁడు తన కేఁకమీఁద నపహరింగిలపఁగిరము లెడఁదం దిగులమిండేసి ముష్కరముగా మందలిఁపింతనె భ్రూకుటితఫాలభాగుండై సర్వసంహారమూర్తి యగు సదాశివుండు

క. శపియించెం బ్రతిభాషణ, గుపితుండై గద్రుఁ డతనిఁ గుష్ఠవ్యాధిం
దపియింపు మనుచు దానికి, నపరిమితభయంబు నొంది యాతఁ డిట్లనియెన్.

శా. స్వామీ! ద్రోహముఁజేసితిం దెలుపవే శాపాంతి ముద్యత్కృపా
ధామా! నా కనుచుం బదాబ్జములమీఁదం బడ్డ నాథ క్షర
తుామందారుఁడు గంతిఁ బొందియపియెం గైలాసశైలంబుఁ గం
టే మానుం బదమన్న నందులకుఁ దా డెందంబునం గుందుచున్.

ఉ. ఈకవితాభిమానము వహించితినేటికి ? శంఖపీఠిపై
నీకవు లున్నయట్లు వసియింపక దేవునితోడ నేల చా
ర్వాక మొనర్చితిం గమభరంబగు కుష్ఠరుజావిషాద మే
నేకరణిన్ ధరింతు నిఁక నెన్నఁడుఁ జూచెద వెండిగుబ్బలిన్. అని వాచాఱుచుఁ గైలాసదర్శనాంతుం దరలితరలి నక్కీరుఁడు మహాకాహార్యముం డగ్గఱి యచ్చట

తే.గీ. హంసిసంసదభీష్టవిహారహేతు,
వై బహూదకహృద్యమై యప్రతర్క్య
మగుచు నద్వంద్వమై పంకజాకరంబు,
వొలిచె బ్రహ్మంబు తెఱఁగునఁ బూర్ణమగుచు.

అట్టి నిర్మలం బైనకాసారంబుఁ గాంచి తత్తటోద్దీపితవటభూజముం జేరి తదీయ శాఖాశైత్యంబున కత్యంతసంతోషంబునొంది కూర్చుండి తద్వటంబుననుండి రాలినపండుటాకులు బట్టబయటఁబడినయవి విహంగంబులు, జలంబులంబడిన యవి మీనంబులునై పోవ నందొక్కపలాశంబు జలాశయంబున సగమును దటప్రదేశమున సగంబునుఁ బడి మీనపక్షిత్వంబులఁ గైకొని లోపలికి న్వెలుపలికిం దిగియు చమత్కారంబును నక్కీరుండు చూచి యద్భుతరసపరవశుండై యత్తఱిఁ దాఁ జేయుచుండుశివపూజయుం దొక్కించుక మదివాయుటయు ఘోర

భీకరాకృతితో నొకమహాభూత మానక్కీరునిం బట్టి తెచ్చి యొకపర్వతబిలం
బునం బడఁద్రోసి తద్ద్వారంబునఁ బండయొక్కటి నడ్డగించి యుదకమాడంజ
నెను. తత్పూర్వ మొక్కైవడిం గొనితెచ్చి చెఱయుంపఁబడిన తొంబదితొమ్మండ్రు
మనుష్యులితనిం గని యున్నాళ్లవఱకుఁ జెఱలో నుండియు భూతంబుచే నొసంగఁ
బడు నాహారముంగొనుచు నసువుల బిగఁబట్టుకొనియుంటిమి. నేఁటికి నీతోఁగూడ
నూర్వురై సకలంబున మననూర్వుర నొక్కకడిగాఁ దినంగలదని వారలు దురంత
మగువంతఁ గుంది వాపోవుచో నక్కీరుఁడు వారల రక్షించుటకై మదిం దలపోసి
యట్టిగొడవ నుడిగింపఁ గ్రౌంచారియే తగినవాఁడని నుతింప దొరఁకొని

ఉ. తారకదైత్యభంజనుఁడు దారుణశక్తిధరుండు పన్నగా
హారహయుండు దీనజనతామరభూజము షణ్ముఖాట్టహా
సారభటీవిపాటితదిగంతకటాహుఁడు వీనిఁ బట్టి సం
హారమొనర్చి యిందఱఁ గృపాంబుధియై బ్రతికించుఁగావుతన్. అని స్తోత్రము
చేయుచు ద్రావిడభాషలో "తిరుమురుహాఱ్ఱుప్పడై" యనుపద్యముల రచించి
బ్రహ్మణ్యోక్తియుక్తముగా నిష్టదేవతావరేణ్యుండును, భక్తశరణ్యుండును నగు
సుబ్రహ్మణ్యుని సన్నుతింప ననుకంపాతరంగితాపాంగుఁడై గుహుండు చండతరవే
గంబునం బయింబడి భూతంబు భూతలంబుపయిఁ బడం జెడచేతనడిఁచి బిలద్వా
రమునం ద్రోచినరాయిఁ దిగిచివైచి యందఱి నెడలుండని యనుగ్రహించినం
డెందంబుల నానందంబునం బొంగి యిందుశేఖరనందను దర్శించి వందనంబులు
సందడింపుచు వారెందేనియుం జనిరి. నక్కీరుండును బునఃప్రణామం బాచరించి
నిలుచుటయుఁ బ్రసన్నతాంకురంబులు ముఖపంకేరుహంబునం బ్రభవింప నీవీ
యెడకు రాఁగతం బేమని యడుగుటయు నిట్లని విన్నవించె.

క. ఓశరణాగతవత్సల! కాశవనప్రభవ! దీనకల్పక! యాప
న్నాశకర! దురితగిరిదే, వేశ నను గరుణఁజూడవే సుఖ నగుదున్.

భవజ్జనకుండును, జగజ్జనకుండును, భవతారకుండు నైననీహారకుత్కీలకన్యకార
మణుం బొనర్చినపద్యమునకుఁ బొరపాటుచెప్పి మహాశివాపరాధం బేనొనర్చి
నం గుపితుండై కుష్ఠవ్యాధివ్యథం బడుమటంచు శపియించెను. శాపగ్రస్తుండనై
వలచాలించి యేను క్షమాపణము వేఁడఁగాఁ గైలాసమహీధ్రంబు దర్శించిన నీకు
ఈరుజంబు మానునని శాపమోక్ష మానతిచ్చిన మధురానగరము నురలుకొని
యిటకే తెంచితి నిఁక నేకైవడి రజతకుధరముం దిలకింపఁజాలుదు నని వగవఁగా
విని తారకవిదారకుండు

శా. కైలాసం బనేగాని యుత్తరదిశాకైలాస మంచాడఁ డా
కాలగ్రీవుఁడు వీఁడు దక్షిణాదిశాకైలాసముం జూచినం
జాలుం గుష్ఠము మానునంచు మదిలోఁ జర్చించి యాపర్వతం
బాలోకింపఁగ నక్రమంబగునుపాయం బాత్మఁ జింతించుచున్.

తనమహత్త్వంబున నచ్చట నొకతటాకంబు నిర్మించి నక్కీరుని వీక్షించి యిక్కొలనిలో మునుఁగుము కైలాసము చూపదు నని వాక్రుచ్చికను మొఱఁగెను.

శా. సేనానీవచనామృతంబు చెవులం జిందంగ డెందంబులో
నానందం బుదయింప నక్కొలనిలో నత్యంతనిష్ఠన్ గృత
స్నానుండై తలయెత్తఁగా నెదుటఁ గానవచ్చె నాతో నవా
చీనస్థాణునగంబు హేమముఖరీసింధుప్రతీరంబునన్.

శా. కుష్ఠవ్యాధియు మానె హేమముఖరీకూలస్థకైలాసము
న్నిష్ఠాధీనమనస్కుఁడై కదిసి తన్నీరంధ్రకల్లోలభూ
యిష్ఠౌఘంబునఁ దీర్థమాడి గిరిజాధీశున్ శివున్ దేవతా
శ్రేష్ఠున్ సంస్తుతి నూఱుపద్యములఁ జేసెన్ ద్రావిడోక్తిన్ దగన్.

ఇట్లప్పద్మాకరం బైనపద్మాకరంబునం గ్రుంకులిడి మీఁదికిఁ దలయెత్తఁగా దక్షిణకైలాసశిఖరముం బొడగన్నయంతనే కుష్ఠరుజంబు పంచబంగాళమై దివ్యతేజంబుతో శ్రీకాళహస్తీశ్వరుం దర్శించి, కాళహస్తి సగముఁ, గైలాసము సగముగాఁ బేర్కొనంబడిన నూఱుపద్యంబులు ద్రావిడోక్తిమయంబుగాఁ బాడి స్తవం బొనరించి నిర్వికారపరబ్రహ్మం బైనసచ్చిదానందశివంబుతో నద్వితీయంబుగా సాయుజ్యంబు నొందెను.

ఇట్లనన్యసాదృశ్యం బైనప్రభావంబుల కాటపట్టైన యీతమిళము సకల భాషలకును జనయిత్రిగా నంతటన్ వ్యాపించి వర్ణోదకపూర్ణకలశానేకప్రతిబింబితఖద్యోతనుంబోలె విరాజమానం బై యాంధ్రకర్ణాటకాదిభాషలయందుఁ దనతమిళపదముల వేనవేలఁ గలపి తద్భాషల విరళంబుగా నభివృద్ధిఁజెందించుచున్నది. అట్లయిన నాంధ్రభాష యితరభాషలకంటెఁ దొలుతటిదై తమిళమునకు సైదోడుగాఁ బ్రకాశించుచుఁ దనదేశపదంబుల నాతమిళములోఁ గలిపి దాను నాతమిళపదంబులఁ జేర్చుకొని విరివిఁజెందుచున్నట్లు గోచరమగుచున్నది.

ఇటులుండ నార్యులు పశ్చిమోత్తరదిగ్భాగమునుండి హిందూస్థానంబున కేతెంచి యటనుండి దక్షిణంబున కరుదెంచినపుఁ డాంధ్రకర్ణాటకులార్యులతోఁ

తెలిమిచేసికొని వారినాగరికములంగైకొని, తమభాషలలోఁ దద్భాషాసాంకర్యం
బు నపారంబుగాఁ గావించుకొని, తమకవితలను సానలఁ దీఱినజాతిరత్నములవలెఁ
బ్రకాశింపించుచున్నారు. ద్రావిడు లార్యులనెయ్యంబుల నియ్యకొనక నేటివఱకు
సదా కలహించుచుండినను సంస్కృతపదములను, శ్లోకలనుగూడ వలసినంతవఱకు
దమిళములోఁ గలుపుకొని యంత్యసంఘకాలానంతరమునుండి కవిత లల్లుచు
న్నారనునది లోకవిదితంబు.

ఇతఃపూర్వము తమిళపదంబు లనేకంబులు "సంస్కృత్య సంస్కృత్యపదా
నిప్రయుజ్యంతే" యని పతంజలి మహాభాష్యమందు వక్కాణించియున్నట్లు వర్ణ
లోపాగమాదేశాదిప్రత్యయంబులచేఁ జక్కఁగా సంస్కరించి వ్యాకరణశిక్షితమై
సంస్కృతభాషలో నవశ్యమైనంతవఱకు, నాసంస్కృతభాషను గల్పించునపుడు
చేర్చి, సమ్మిళితమై యుండుటయు వాని స్వీయద్రావిడ సమంజసధాతువులవలనఁ
దేటపడుచున్నది. ఇటీవల భాట్టమందే యిరువదిమూఁడుద్రావిడపదములు సంస్కృ
తములోఁ జేర్చుకొనఁబడియున్నవి యని వ్రాసియుండుటను గమనించిన విశ
దమగును.

వలసినఁ గొన్నింటి నిట నుదాహరించెదను.

| తమిళము. | | సంస్కృతము. | తమిళము. | | సంస్కృతము. |
|---|---|---|---|---|---|
| i. ఇడై | = | ఇడ | కుట్టం / కుట్టం | = | కుష్ఠః |
| పిన్గలై | = | పింగళ | తమిళం | = | ద్రవిడం |
| సుళి(ష్పి)మునై | = | సుషుమ్న | తిప్పిలి | = | పిప్పిలి |
| నారత్తై | = | నారంగ | కరుప్పం | = | గర్భః |
| మెదు | = | మృదు | (నిఱు)నిలై | = | నిలయం |
| పవళం | = | ప్రవాళః | నీర్ | = | నీరం |
| మకిళం | = | వకుళః | మాదం | = | మాసం |
| మణ్డారం | = | మణ్డారః | మీన్ | = | మీనం |
| విట్టల్ | = | విష్టిః | తామరై | = | తామరసం |
| పడికం | = | స్ఫటిక | పుడవి | = | పృథ్వీ |

విస్తరభీతిచేఁ జాలించుకొంటిని.

III. ఇఁక నీతమిళమునకును దెలుఁగునకు నేయేకారణములచే సంబం
ధము వాటిల్లుచున్నది యనువిషయమును నేన నాయల్పజ్ఞానముంగొని యెఱిఁగి

నంత సంగ్రహముగా నీవిద్వన్మండలిలో నిశ్శంకముగా వాకొని నాయుపన్యాసమును విరమించెదను.

మొదట లక్ష్యంబులవలనఁ గలిగినసంబంధంబుల నిరూపించెదను.

తమిళపదంబులు— i. తెలుఁగు ప్రత్యయములఁ జేర్చుటవల్లను,
ii. వర్ణలోపాగమాదేశములచే మార్చుటవల్లను,
iii. ఔపవిభక్తిక, విభక్తివర్ణకముల నతికించుటవల్లను దెలుఁగుపదములుగా సంస్కరింపఁబడి యాంధ్రభాషలో నభేదంబుగా వ్యవహరింపఁబడుచున్నవి.

అయిన నార్యభాషలోనిపదములు సయితము తెలుఁగుబాసలో వాడంబడుటను జూడలేమా యన్నయెడల, నవి తద్భవతత్సమభేదంబులచేఁ గ్రిందఁ గనిపింపఁబడిన నియమంబులచేఁ దెలుఁగు బాసలో వాడంబడుట యథార్థమే. కాని యట్టిపదంబులు అచ్చతెలుఁగులోఁ దలచూపక బొత్తిగాఁ దొలఁగియుండుటంజేసి తమిళపదంబుల కున్నంతసంబంధము సంస్కృతమునకు లేక పోవుచున్నది. తమిళపదంబు లచ్చతెలుఁగులోఁ గలువుఁగోలుగా నన్యాంధ్రదేశధర్మంబులో వ్యవహరింపఁబడుచున్నవి. అట్టి తమిళపదంబుల నచ్చతెలుఁగులో నుండి పెఱికివైచినయెడల నచ్చతెనుఁగు కబ్బము దేశపదములకిరవై చాలమింజేసి కడముట్టఁజాలదు. తమిళపదములు తెలుఁగులో సగముకంటె నెక్కువగా నుండు ననియే బోధపడుచున్నది. వానిలోఁ గొన్నింటి నీదిగువ నుదాహరించెదను.

I. శరీరసంబంధమైన పదములు.

| తమిళము. | తెలుఁగు. | తమిళము. | తెలుఁగు. | తమిళము. | తెలుఁగు. |
|---|---|---|---|---|---|
| తలై | = తల | తుడై | = తొడ | మదిని | = వదినె |
| కణ్ | = కన్ను | నెత్తొర్ | = నెత్తురు. | ఇల్లాళ్ | = ఇల్లాలు |
| మూక్కు | = ముక్కు | II. చుట్టఱికము. | | III. వస్తువాచకములు. | |
| పల్ | = పల్లు | అమ్మాళ్ | = అమ్మ | ఊర్ | = ఊరు |
| నాకు | = నాలుక | అయ్యర్ | = అయ్య | పట్టినం | = పట్టణము |
| కై | = కై | అణ్ణర్ | = అన్న | కోట్టై | = కోట |
| విరల్ | = వ్రేలు | అక్కాళ్ | = అక్క | అకిల్ | = అగరు |
| ఉహిర్ | = గోరు | తంబి | = తమ్ముఁడు | ఇల్ | = ఇల్లు |
| తోల్ | = తోలు | మామన్ | = మామ | మున్రిల్ | = ముంగిలి |
| మిడఱు | = మెడ | అత్తై | = అత్త | మేడై | = మేడ |

| తమిళము. | | తెలుఁగు. |
|---|---|---|
| మఴై | = | మల |
| ఆఱు | = | ఏఱు |
| కుళం | = | కొలను |
| కాడు | = | కాడు |
| పులం | = | పొలము |
| కడల్ | = | కడలి |
| అలై | = | అల |
| నురై | = | నురుగు |
| పాసి | = | పాచి |
| ఉప్పు | = | ఉప్పు |
| పుడవి | = | పుడమి |
| నాడు | = | నాడు |
| నిలం | = | నేల |
| ఆ | = | ఆవు |
| ఎరుదు | = | ఎద్దు |
| పాల్ | = | పాలు |
| వెణ్ణెయ్ | = | వెన్న |
| నెయ్ | = | నెయ్యి |
| పరుప్పు | = | పప్పు |
| చెఱుప్పు | = | చెప్పు |
| కఱుప్పు | = | కప్పు |
| మరుందు | = | మందు |
| ఇఱైచ్చి | = | ఎఱచి |
| పూ | = | పూ |
| పకల్ | = | పగలు |
| ఇరవు | = | రేయి |
| ఇరుళ్ | = | ఇరులు |
| కారం | = | కారము |
| తిత్తిప్పు | = | తీపు |
| పుళిప్పు | = | పులుపు |
| తువర్ | = | ఒగరు |
| కుడై | = | గొడుగు |

| తమిళము. | | తెలుఁగు. |
|---|---|---|
| సువై | = | చేవ |
| ఉఱుది | = | ఉఱుద |
| పిఱ | = | పెఱ |
| పాఱై | = | పాఱ |
| ఒలి | = | ఉలివు |
| మాఱ్ఱం | = | మాట |
| విణ్ | = | విన్ను |
| కాల్ | = | గాలి |
| నెరుప్పు | = | నిప్పు |
| నీర్ | = | నీరు |
| మణ్ | = | మన్ను |
| పొన్ | = | పొన్ను |
| పోర్ | = | పోరు |
| ఏదం | = | ఏదు |
| యానై | = | ఏనుఁగు |
| మా | = | మావు |
| పులి | = | పులి |
| చిఱుత్తై | = | చిఱుత |
| పుళ్ | = | పులుగు |
| తెరివై | = | తెఱవ |
| మగళ్ | | మగువ |
| చుఱ్ఱం | = | చుట్టము |
| ఇన్బు | = | ఇంపు |
| విల్ | = | విల్లు |
| అంబు | = | అంబు |
| పందల్ | = | పందిరి |
| ముల్లై | = | మొల్ల |
| మరం | = | మ్రాను |
| చెడి | = | చెట్టు |
| కొంబు | = | కొమ్మ |
| తళిర్ | = | తలిరు |

| తమిళము. | | తెలుఁగు. |
|---|---|---|
| పుదర్ | = | పొద |
| విలై | = | వెల |
| వలై | = | వల |
| పేర్ | = | పేరు |
| కత్తి | = | కత్తి |
| వణ్డి | = | బండి |
| తేర్ | = | తేరు |
| పల్లక్కు | = | పల్లకి |

IV. క్రియావాచకములు.

| తమిళము. | | తెలుఁగు. |
|---|---|---|
| పో | = | పో |
| ఎఴు | = | ఎయిదు |
| పిణై | = | పెనఁగు |
| ఊన్ఱు | = | ఊను |
| ఏమాఱు | = | ఏమఱు |
| అడంగు | = | అడఁగు |
| అడర్ | = | అడరు |
| అనుప్పు | = | అనుపు |
| ఉగుళ్ | = | ఉరలు |
| తిన్ | = | తిను |
| ఎదిర్ | = | ఎదురు |
| ఉదవు | = | ఒదవు |
| కలంగు | = | కలఁగు |
| కాణ్ | = | కను |
| తుడై | = | తుడుచు |
| తొడర్ | = | తొడరు |
| ఆళ్ | = | ఏలు |
| తులంగు | = | తొలంగు |
| మలై | = | మలయు |
| కల | = | కలయు |
| విడు | = | వీడు |

| తమిళము. | తెలుఁగు | తమిళము. | తెలుఁగు | తమిళము. | తెలుఁగు. |
|---|---|---|---|---|---|
| చేర్ | = చేరు | పెరుగు | = పెరుగు | పత్తు | = పది |
| నిల్ | = నిలు | V. సంఖ్యావాచకములు. | | ఇరుపదు | = ఇరువది |
| ముంగు | = మునుఁగు | ఒన్రు | = ఒండు | ముప్పదు | = ముప్పది |
| చెయ్ | = చేయు | ఇరణ్డు | = రెండు | నాఱ్పదు | = నలువది |
| నఱుకుఱ | = నఱుకు | మూన్రు | = మూడు | ఐమ్బదు | = ఏఁబది |
| కుత్తు | = గుద్దు | నాన్గు | = నాలుగు | అఱుపదు | = అఱువది |
| ఉడన్బడు | = ఒడంబడు | ఐన్దు | = ఐదు | ఎళుపదు | = డెబ్బది |
| విరి | = విరియు | ఆఱు | = ఆఱు | ఎణ్బదు | = ఎనుబది |
| పరత్తు | = పఱచు | ఏళు.(ఴ) | = ఏడు | తొణ్ణూఱు | = తొంబది |
| కోర్ | = కోరు | ఎట్టు | = ఎనిమిది | నూఱు | = నూఱు |
| ఉమిఴ్ | = ఉమియు | ఒన్బదు | తొమ్మిది | | |

రెండవది లక్షణములవలనఁ గలిగిన సంబంధముల నిరూపించెదను.

తెలుఁగు బాసకుఁ దమిళమునకువలె లక్షణంబు లనేకంబులు గలవు. వానిలో శ్రీ నన్నయభట్టారకులచే విరచింపఁబడిన దని వాడంబడు ప్రక్రియాకౌముది యనునాంధ్రశబ్దచింతామణి యార్యభాషలో నెనుబది రెండార్యలచే నైనది. వ్యాకరణసంజ్ఞానియమంబు లన్నియు నార్యభాష ననుసరించియే చేయఁబడియున్నయవి. అట్లైనను, విషయములు ప్రాయికముగాఁ దమిళము ననుసరించియే యున్నవి. ఇందునకుం గారణ మారసిచూడ ద్రావిడభాష సెందమిళ్, కొడుందమిళ్ అని రెండు విధంబులుగా భాగింపఁబడియున్నది. సెందమి అనునది స్వచ్ఛమై నాగరకతఁ జెందినశుద్ధద్రావిడము. కొడుందమిళ్ అనునది తొలుత మానవులచే భాషింపఁబడిన, నాగరకత యంతగా నలవడని, తమిళపదంబులు బహుదేశాచారములకుఁ దగిన ట్లాయాదేశభాషలచే వికారముఁ జెందఁబడి ద్రావిడధాతువులవలనఁ గలిగిన భాష యనంబడును. కావునఁ గేవలద్రావిడప్రాయులు సెందమిళమునుమాత్రము గైకొనుచు, తమిళమును జుట్టువాఱియుండు నాంధ్రకర్ణాటకాదిభాషలుగా వికారముఁజెందినకొడుందమిళము నభ్యసింప మనసురాక వదలిపెట్టిరి. పశ్చిమోత్తరదిగ్భాగమునుండి హిందూదేశమున కేతెంచిన యార్యు లాంధ్రులతోడి సఖ్యము గలిగినకతంబున నాయార్యు లాంధ్రభాష నభ్యసించి యీయాంధ్రమునకుఁ, బూర్వము గలిగియుండిన లక్షణంబుల నెల్ల

నడఁగఁద్రొక్కి, క్రొత్తగా లక్షణ మొనర్పనుద్యమించి శ్రీనన్నయభట్టారకుల చేత నార్యభాషయందు వ్యాకరణముఁ జేయించిరి యని పెద్ద లూహించుచు న్నారు. కావుననే తమిళముననుసరించి యుండువిషయంబుల సంస్కృతపంక్తిగా మార్చుటకు వలనుపడక సంజ్ఞానియమనామంబుల నెల్ల సంస్కృతరూపముగాఁ బొందుపఱచియున్నారు కాఁబోలు.

(1) వర్ణములు :—

| తమిళము. | | తెలుఁగు. | |
|---|---|---|---|
| ఉయిరెళుత్తుక్కళ్ | 12 | అచ్చులు | 12 |
| మెయ్యెళుత్తుక్కళ్ | 18 | హల్లులు | 22 |
| ఆయ్దవెళుత్తు | 1 | ఉభయములు | 2 |
| అంతు | 31 | | 36 వర్ణములు. |

ఇందులో వల్లినఱకారము గురురేఫమైన ఱ (శకటరేఫము) ఈ వర్ణ మొకఁటియే తమిళమునకుం దెలుఁగునకుం గలసంబంధమును జక్కఁగా వెల్ల డించుటకు ముఖ్యకారణములలో నొక్కటి.

ఆంధ్ర-శ-చిం, సంజ్ఞా-స-సూ.

"అన్యోన్యవ్యాకరణస్పష్టా రస్త్వత్ర గృహ్యతే ద్వివిధః"

"నాన్యేషాంవైధర్మ్యం లఘ్వలఘూనాంరయోస్తు నిత్యం స్యాత్."

అనుసూత్రములవలన నీయాంధ్రద్రావిడభాషలకే యీగురురేఫము గలదనియు, రేఫమునకు లఘ్వలఘుభేదములవలన యతిప్రాసములమైత్రికి విరోధము గలదని యుఁ దెలియఁబడుచున్నది.

ఇఁక నీతెలుఁగుబాసలోఁ గలఖండానుస్వార, దంత్యచజలు, తెలుఁగునం గాక యితరభాషలయందుఁ గానరావు కావున నీరెండువిషయమే యీతెలుఁగు, అనాదిసిద్ధమైనస్వతంత్రభాష యనుటకుఁ జాలినంతవఱకు నొప్పియుండును. ఖండానుస్వారప్రయోగ మీబాసకుఁ బెద్దవన్నెఁ దెచ్చిపెట్టునది యగును. ఈ ఖండానుస్వారము వర్ణకములవదలిపెట్టి సంగ్రహించివ్రాయుట కెడమిచ్చునదియు, నర్థభేదములరెండును సమాసోత్తరపదాదివర్ణములఁ జక్కఁగ స్ఫురింపఁ జేయు నట్టిదియునై మహత్తరవిలాసముం దెచ్చిపెట్టునన్నది వైయాకరణులకుఁ జెప్ప కయ తెలియనగును.

నామవాచకమునకు నవశ్యమైన లింగపురుషవచనశబ్దముల గుఱించి విచారింతము.

లింగము :—ఆర్యభాషలో లింగములు శబ్దస్వరూపంబులంబట్టి నియతములైనవిగాని యర్థస్వరూపముంబట్టి లేవు. ఈ యాంధ్రిభాషకుఁ దమిళముంబోలి యర్థస్వరూపముం బట్టి లింగనిర్ణయము సేయఁబడియున్నదిగాని యార్యభాషం బోల్చి కాదు.

ఆర్యభాషాలింగముల కుదాహరణము.

1. వజ్రాయుధ నామదశకంబులో.

పవిః
శతకోటిః
స్వరుః
శంబః
దమ్భోళిః } పుంలింగము.

హ్రాదినీ—స్త్రీలింగము

కులిశం
భిదురం } నపుంసకలింగము.

అశనిః—పుంస్త్రీలింగము

వజ్రం—పున్నపుంసకలింగము.

2. ధూళినామచతుష్కంబులో.

పాంసుః—పుల్లింగము
ధూళిః—స్త్రీలింగము
రేణుః—పుంస్త్రీలింగము
రజః—నపుంసకలింగము.

తమిళము తెలుఁగులలో నట్లుగాక, మగవానినిఁ గుఱించినది—పుల్లింగము.
ఆఁడుదానిని గుఱించినది—స్త్రీలింగము.
తిర్యగ్జడముల గుఱించినది—నపుంసకలింగము
లనియే నిర్ణయింపఁబడియున్నది. ఉదాహరణములు.

| తమిళము | తెలుఁగు | లింగము. |
|---|---|---|
| ఇరామన్ | రాముఁడు | పుల్లింగము. |
| పార్వతి | పార్వతి | స్త్రీలింగము. |
| కుదిరై | వారువము | నపుంసకలింగము. |
| మరమ్ | మ్రాను | |
| వేళై | వేళ | |

ఇట్లూహ్యంబులు.

పురుషమును గాలమును నన్నింటికి సమమే.

వచనము—ఆర్యభాషలో నేకవచన, ద్వివచన, బహువచనము లని మూఁడుగలవు.

తెలుఁగుభాస కట్లులేక దమిళమునకుఁ బోలియే యేకవచన బహువచనము లని రెండే కలవు.

ఇంక సర్వనామములు :—

అవన్ = వాఁడు. తమిళపద మైన అవన్ అనుపదములో మొదటి అకారము వకారముమీఁద నెక్కి వా యని యేకపదమై, పిదప న్ అను పొల్లు తెలుఁగులో ద్రుతరూప మైనయరసున్నయై వాఁ అని యాయెను ; మఱియుఁ బ్రథమపురుషైకవచన ప్రత్యయమైనడువర్ణకము చేరి వాఁడు అనియాయెను.

ఇవన్ = వీఁడు. ఈపదములో ఇవన్ అన్నందులో ఇకారము వకారముమీఁద నెక్కి వి యయి, దీర్ఘముచేరి వీ యనియు, న్ అనుపొల్లు ఖండబిందువై వీఁ అని యాయెను, డువర్ణకము చేరి వీఁడు అని రూపమైనది.

ఎవన్ = ఎవఁడు. ఏఁడు, ఇ కున ఎవన్ అన్నందులో న్ అనుపొల్లు ఖండబిందువై ఎవఁ అనియు, డువర్ణకముచేరి ఎవఁడు అని తెలుఁగురూపమైనది.

అదు = అది. ఇందులో అదు అనుపదమునం గలదుకారముమీఁదనుండు ఉకారము ఇకారాదేశమై అది యని తెలుఁగురూపమైనది.

ఇట్లే ఇదు = ఇది యనియు, ఎదు = ఎదియనియురూపమైనది.

తమిళములో (చుట్టుచ్చొల్) అనుపదము తెలుఁగులో, గుఱ్ఱించునది యైన సంబంధార్థకసర్వనామశబ్ద మనఁబడును. అట్టి అ-ఇ-అది, ఇది యను నవియు, ఎ యను (వినావెళుత్తు) ప్రశ్నార్థకవర్ణ మైన ఎ-ఎది యనునదియుఁ దెలుఁగునకుఁ దమిళసంబంధమే గాక యార్యభాషాసంబంధములు గావు. ఏకాక్షరరూప మైనప్రశ్నార్థకవర్ణములు తెలుఁగు తమిళములకే గలవుగాని యితర భాషలకు లేవు. కాఁబట్టి మిగిలినవన్నియు విడిచిపెట్టి యీసంబంధార్థక సర్వనామవాచకవిషయ మొక్కటే తమిళసంబంధము తెలుఁగునకుఁ గలదని నిరూపించుటకుఁ జాలదా ?

మఱియు, వాక్యంబులోఁ గర్తృపదంబు లోపించినపుడు క్రియాంతములవలన నామముయొక్క లింగ, పురుష, వచనాది నిర్ణయము లార్యభాషలో బోధపడవు. ఆంధ్రభాషలోఁ దమిళముఁబోలియే క్రియాప్రత్యయాంతములచేఁ జక్కఁగా సుబోధక మగును. ఈవిషయమును దమిళసంబంధమును నిరూపించుటకు ముఖ్యమైనవిషయములలో నొక్కటి.

ఉదాహరణము.

తమిళము. తెలుఁగు.

ఉణ్కిన్ఱాన్ = అన్. తినుచున్నాఁడు. ఇందులో "డువర్ణకము" (వాఁడు తినుచున్నాఁడు). అని ప్రథమపురుష మహచ్ఛబ్దపుల్లింగైకవచనంబును బోధించుచున్నది.

ఉణ్కిన్ఱనళ్ = అళ్. తినుచున్నది. ఇందులో 'ది,' వర్ణకము (అది తినుచున్నది). యని ప్రథమపురుషమహతీశబ్ద స్త్రీలింగైకవచనంబును;

ఉణ్కిన్ఱనర్ = అర్. తినుచున్నారు. ఇందులో "రు" వర్ణకము (వారు తినుచున్నారు). అని ప్రథమపురుషమహచ్ఛబ్ద పుంస్త్రీ లింగబహువచనంబులను.

ఉణ్కిన్ఱదు = దు. తినుచున్నది. ఇందులో "ది" వర్ణకము (అది తినుచున్నది). యని "స్త్రీవదేకవచనంతు" అను సూత్రప్రకారము ప్రథమపురుష అమహచ్ఛబ్ద నపుంసక లింగైక వచనంబును;

ఉణ్కిన్ఱన = అ. తినుచున్నవి. ఇందులో "వి" వర్ణకము (అవి తినుచున్నవి). యని ప్రథమపురుష అమహచ్ఛబ్దనపుంసకలింగబహువచనంబును;

ఉణ్కిన్ఱనై = ఐ. తినుచున్నావు. ఇందులో "వు" వర్ణకము (నీవు తినుచున్నావు). అని మధ్యమపురుషత్రిలింగైకవచనంబులను.

ఉణ్కిన్ఱనిర్ = ఇర్. తినుచున్నారు. ఇందులో "రు" వర్ణకము (మీరు తినుచున్నారు). అని "సర్వేషాం బహువచనే రు ఇతిస్యాత్" అనుసూత్రప్రకారము మధ్యమపురుష త్రిలింగ బహువచనంబులను.

ఉణ్కిన్ఱేన్ = ఏన్. తినుచున్నాను-ఇందులో "ను" వర్ణకము (నేను తినుచున్నాను) అని యుత్తమపురుష త్రిలింగైకవచనంబులను.

ఉణ్కిన్ఱేమ్ = ఏమ్. తినుచున్నాము. ఇందులో "ము" వర్ణకము (మేము తినుచున్నాము. అని "ఉత్తమస్యతుభవేన్ముః" అను సూత్రప్రకారము ఉత్తమపురుష త్రిలింగబహువచనంబును సూచించుచున్నవి.

నామములు విభక్తిసహాయముగాఁ బూర్వము ఉపవిభక్తిప్రత్యయము లఁ బొంది పిదప విభక్తివర్ణకములఁ బొందునప్పుడు "ఔపవిభక్తికాంత" మనియు, నుపవిభక్తికముల సహాయము లేకనే విభక్తివర్ణకంబులఁ బొందునపుడు అనౌప విభక్తికాంతములనియు వాడంబడును. ఈ రెండువ్యవహారములును దమిళమునకు వలెఁ దెలుఁగునకుం గలవు.

ఔపవిభక్తికాంతముల కుదాహరణములు.

| తమిళము. | తెలుఁగు. | | |
|---|---|---|---|
| మరమ్ + ఐ = మరత్తై | ప్రాఁత + ని = ప్రాఁతటిని | టి | యుపవిభక్తికము. |
| మరమ్ + ఆల్ = మరత్తాల్ | విల్లు + చేతన్ = వింటిచేతన్ | ంటి | ,, |
| మరమ్ + కు = మరత్తుకు | చేయి + కి చేతికి | తి | ,, |
| మరమ్ + ఇరుందు = మరత్తిలిరుందు | నోరు + కంటె = నోటికంటె | టి | ,, |
| మరమ్ + ఉడయ = మరత్తినుడయ | చేను + యొక్క = చేనియొక్క | = ఇ | ,, |
| మరమ్ + కణ్ = మరత్తినకణ్ | కన్ను + అందున్ = కంటియందున్ | = ంటి | ,, |

అనౌపవిభక్తికాంతముల కుదాహరణము.

| తమిళము | తెలుఁగు |
|---|---|
| మనిదన్ + ఐ = మనిదనై | తల + ను = తలను |
| మగన్ + ఆల్ = మగనాల్ | వెలుఁగు + చేత = వెలుఁగుచేత |
| మణి + కు = మణిక్కు | తరువు + కొఱకు = తరువుకొఱకు |
| వాయ్ + ఇన్ = వాయిన్ | దానము + కంటె = దానముకంటె |
| కుమరన్ + అదు = కుమరనదు | చెవి + యొక్క = చెవియొక్క |
| నల్లార్ + కణ్ = నల్లార్కణ్ | వనము + న = వనమున. |

III. మూఁడవది యైనసాహిత్యవిషయములోని నిబంధనలన్నియు నార్యభాషంబోలిన వైనను పద్యములయతిస్థానమందు వర్ణమైత్రియు, నాలుగుపాదములయందును ప్రాసమైత్రియుఁ గలిగి తమిళసంబంధమునే యనుసరించియున్నవి. మఱియు నన్యభాషాసాంకర్యము చొఱఁబడని శుద్ధద్రావిడోక్తిమయ సంఘసాహిత్యంబులచే నలరారుదమిళమునుంబోలియే సాంస్కృతికసంబంధము లేని యచ్చతెనుఁగుకావ్యంబులతోఁ దెలుఁగుబాసయు సమధికప్రాభవంబుచే నన్ని భాషలకంటె మిన్నయై మెఱయుచున్నది. ఈయచ్చతెలుఁగుకబ్బంబులే తమిళ సంబంధమునుఁ జాలినంతవఱకుఁ బొందియున్నవి.

వీనినంతయుఁ దీసి యవతలఁ బెట్టి ద్వ్యర్థికావ్యంబు లైనరాఘవపాండవీయము, హరిశ్చంద్రనలోపాఖ్యానంబులచేతను, ద్వ్యర్థికావ్యంబైన రాఘవయాదవపాండవీయముచేతను వన్నెకెక్కి తుఱంగలించుచుండు నీయాంధ్రభాషం గొనియాడుటకు వేనోళ్లు చాలవు.

ఇటీవలఁ గారణములఁ జక్కఁగఁ బరిశీలించుట కవకాశము గలుగనేరని కొందఱూహించున ట్లీయాంధ్రభాష వేయిసంవత్సరములకు లోఁబడి శ్రీనన్నయభట్టారకులవలన నుత్పత్తిల్లినది యనిగాని, నాలుగైదువేలేండ్లనుండి యార్యభాషాపకారముచేఁ గల్పింపఁబడినదనిగాని వచింపఁదగనిదై, ప్రపంచంబునఁ దమిళము పాడనూపిననాఁటనుండి తమిళమునకు సైదోడుగాఁ బుట్టి ద్రావిడదేశమును డాపరించిన దేశమాదు వ్యాపింపఁబడి, యొకరిచేతఁ గల్పింపఁబడక జగంబునం గలజానపదుల నోటిమాటగా వ్యవహరింపఁబడెడు దేశభాషారూపమై స్వతస్సిద్ధముగా విలసిల్లుచున్నది యనియుఁ, గ్రిందఁ జూపింపఁబడినలక్ష్యలక్షణవ్యవహారంబులచేతను, అచ్చతెలుఁగులో నార్యభాషవలెఁ దొలఁగిపోవక నభేదంబుగాఁ గలసియుండుటచేతను దమిళసంబంధమును మెండుగాఁ బొంది ప్రాచీనభాషగాఁ బ్రవర్తిల్లుచు, నిప్పటికిఁ గొంతకాలమునకు ముందుండి యార్యభాషాసాంకర్యము వడసి, యార్యద్రావిడాదిభాషలకంటె నెక్కుడుఛందోవిషయంబులును, వర్ణనాలంకారములును, నసదృశకల్పనాచమత్కారపూరితశృంగారాది రసంబుల కాలవాలంబును, గాంధర్వవిద్యాలతానికుంజంబుల కాలంబనమునై, యచ్చతెలుఁగు, ద్వ్యర్థి, త్ర్యర్థికావ్యంబులవలన సానలఁదీఱినజాతిరత్నమువలెఁ బ్రకాశించుచున్నదనియు నాంధ్రభాషాభిమానులైనప్రాజ్ఞుల కెల్లరకును దెలిసినవిషయమే. జగంబునం గలభాషలన్నిటిలోనిపద్యము లనేకంబుల వినుచుండెడి పామరుఁ డొక్కండు డీతెలుఁగుబాసలోని యొక్కపద్యమును విన్నమాత్రమున వానిడెందం బానందంబుచేఁ గందళించి పారవశ్యమొందు ననుట కెంతేనియు సందియంబు వొడమదు.

మదీయబహుజన్మకృతపుణ్యఫలపరిపాకంబునం జేసి, ద్రావిడజాతిసంభూతుండ నయ్యునైదవయేఁటఁ బంచాక్షరీమహామంత్రపురస్సరం బైనమహాశైవభాష యగునీయాంధ్రభాష నభ్యసింపఁ దటస్థించినమామకభాగధేయంబునకై యహోపురుషకత్వంబుచే విఱ్ఱవీఁగుచుండు నే నీయాంధ్రసాహిత్యపరిషత్తులోఁ గవిత్రయసదృశులయినపండితమహామండలి కట్టెదుట నిలిచి పలుకరించుటకుఁ దెగించిననాతెగువకు మన్నించి, నాదగునల్పజ్ఞానంబుఁ గొని యాంధ్రద్రావిడభాషాపరస్పరసంబంధంబును గుఱించి వాకొన్నవిషయమందు సర్వజ్ఞులయినసభాస్తారులందఱును సారగ్రాహరసజ్ఞతాభావంబునం బ్రమాదంబులం బరిత్యజించి నన్ననుగ్రహింపవలయు నని నానిండారుమనంబుతోఁ బ్రణామపురస్సరముగాఁ బ్రార్థించుచున్నాఁడను.

టి. యస్. మురుగేశ౯,
తెలుఁగు పండితుఁడు, ఎట్టియాపురము.

# ప్రతాపచరిత్రము.

(వెనుకటి శేషము).



తనమేనత్తయగు శ్రీరంగమదేవియు పంపినరహస్యపుపత్రికలు చదువుకొని వైరంబుమాని బాంధవంబుగా జేసితిమని యావిప్రులకు అగ్రహారమధ్యంబున మార్గంబును ఇచ్చుటకై యాబై వేలమాడలు సమర్పించి వారలతోడ బాటగని శ్రీరంగమదేవిని చూచెదనని హనుమద్గిరికి చనుదెంచుటయు అంతి భువనైకమల్లుడు దేవియు క్తంబై యెన్నిదియోజనంబులు ఎదురుగాబోయి వేంకటనాథుని వినయభక్తిపూర్వకంబుగా దోడ్తెచ్చి తనకు రాజధాని యగుహనుమకొండ ప్రవేశించి అప్పురంబున మాసద్వయంబును నిలిపి పురంబును అంతఃపురంబును శృంగారించి తనపుత్రి యగుపాంచాలిని వేంకటనాథునికి వివాహంబు జేసి అనేకవస్తువాహనంబులును అమూల్యాభరణంబులును కొండవీడు మొదలుగా విదర్భదేశంబును అచ్చెలియ కరణం బిచ్చిన నరపతిరాయలకు కట్నంబు గట్టి దేవియుక్తంబుగా వేంకటనాథుని విజయనగరంబునకు సంపుటయు. ఆభువనైకమల్లుండు డెబ్బది ఆరేండ్లు రాజ్యంబుపాలించి తనసుతుండగు త్రిభువనైకమల్లునకు పట్టంబుగట్టి తాను కైలాసనివాసుండగుటయు. ఆత్రిభువనైకమల్లుడు కాకితదేవవరప్రసాదంబున ఒకసుతునిం గని కాకితప్రోలరాజు అనునామకరణంబు జేసి తనయాజ్ఞకు మరలబడ్డకటకవల్లభునిపై దండెత్తి వానిని సంహరించి వానిసుతునకు పట్టంబుగట్టి యెప్పటియట్ల మూడుకోట్లసువర్ణటంకంబులు అప్పనంబులు పుచ్చుకొని గంగాతీరంబున గడమయుయిన దేవతానివాసంబులు పూర్తిగా గట్టించి డెబ్బది నాలుగేండ్లు రాజ్యంబుపాలించి కాకితప్రోలరాజుకు పట్టంబుగట్టి తాను శివలోకంబున కేగుటయు.

## కాకతి ప్రోలరాజువృత్తాంతము.

(కాకతి ప్రోలరాజు) బాలుండగుటం జేసి అతని సరుదార్లు సామంతులు అతనికి ద్వి(వి)ముఖులగుటయు అదివిని కటకవల్లభుండు విశ్వనాథదేవుని దళవాయిని జేసి పంపిన నతడువచ్చి హనుమకొండ ముట్టడవేసి పదినెలలు ఉండుటయు అంతలోపల కాకితప్రోలరాజు తనపురంబున ఆప్తవర్గంబుతో వెలువడి దొరలు

సరుదార్లు తానును కటకంబుపై దండయాత్రచని కటకవల్లభునితో యుద్ధంబుచేసి వానితల త్రెంచి వానిసుతునికి పట్టంబుగట్టి మొప్పటియట్ల మూడుకోట్ల సువర్ణ టంకంబులు అప్పనంబులు గయికొని చేరవచ్చి కటకవల్లభునిదళంబులు సారెదోలుటయు. గంగాతీరంబున చేయగగమయిన దేవాలయంబులు గట్టించి చెన్నరాయల ప్రతిష్ఠజేసి అక్కడ నొక్కకోనేరు గట్టుటయు మరియు నొక్కనాడు ఆ రాజు సమ్ముఖంబునకు త్రిదండిమునులను ఏతెంచిన వారల బహువిధంబుల పూజించి వారిచే హిడింబాశ్రమమాహాత్మ్యంబు విని అచట కొన్ని శివాలయంబులు గట్టించి రాజ్యంబేలుసమయంబున ఒక్కనాడు ఈరాజుపట్టనంబున గ్రామార్థులయిన పరిజనంబులు శకటంబులు కొలువు నుంచుకొని గొల్లి వచ్చునెడ హానుమద్గిరికి ఆగ్నేయభాగంబున క్రోశద్వయపర్యంతంబున నిర్నిమిత్తంబున వచ్చు బండి ఊరికే ఒరుగబడుటయు ఆరాత్రి శకటంబుల చక్ర ద్రోయజాలక వారచ్చట నిలచి హనుమకొండకు నేగుటయు అప్పుడు బహుజనంబుల గూర్చుకొని యా బండి చక్రంద్రోయుసమయంబున ఆబండికమ్మి శుద్ధసువర్ణం బగుటయు అది చూచి సువర్ణంబు తమకు లభించుటంజేసి అతిత్వరితంబుగా హానుమద్గిరికి వచ్చి కాకితప్రోలరాజున కెరిగించిన విస్మయానందభరితుండై బుధజనపురోహితామాత్య భృత్యులతో నచటికి చనుదెంచి అచట పాలించిన పరుసవేది శ్రీశంభులింగంబు గనుపట్టుటయు ఆజ్యోతిర్మయం బగుసువర్ణలింగంబును హానుమకొండకు దెచ్చిపోవుట కుద్యోగించిన ఆదేవుండును పెర్లకుండన చింతించి తదనంతరంబున కాళేశ్వర నివాసులయినరామారణ్యశ్రీపాదులను త్రికూటనివాసులను హిడింబాశ్రమనివాసులయినత్రిదండమునులను పిలుపించి వారల నెదుర్కొని అత్యంతభయభక్తిసి అర్ఘ్యపాద్యంబుల పూజించి యద్దేవుని జూపిన వారలత్యంతహర్షంబున అద్దేవుని కభిషేకంబులుచేసి విభూతి శ్రీచందనం బలంకరించి బిల్వదళనానావిధపుష్పంబుల సహస్రనామంబుల పూజచేసి మహానైవేద్యంబులు ఇచ్చి యద్దేవునుమధ్యప్రదేశంబున నుండునట్లుగా యోజనవిస్తారంబుగా పురంబు గట్టవలంచి శాలివాహనశక వర్షంబులు తొమ్మిదినూటతొమ్మిదియగుశుభకృత్ నామసంవత్సరం కార్తీకశుద్ధ ౫ గురువారంబున రోహిణీనక్షత్రంబున వొరంగల్లు కట్టుటయు అప్పురి అభేద్యం బగునట్లు రామారణ్యశ్రీపాదులు దలంచి శ్రీవిద్యాధరచక్రం బనుయంత్రప్రకారంబును కోటకు రేఖలువ్రాసి చుట్టును పరిహారిగా దవ్వించుటయును. మరియును హనుమకొండగవినినుండి స్పర్శవేధి యగుశంభులింగంబు నగరిపర్యంతంబును

రెండుకోసులు వీధి యేర్పఱిచి ఉభయ పార్శ్వంబుల దేవాలయంబులు కట్టించి ప్రతిష్ఠలు చేసిన దేవతలపేరులు, శ్రీవిశ్వనాథుండును ముక్తీశ్వరుండును కాళహస్తీశ్వరుండును రామేశ్వరుండును రాజేశ్వరుండును భీమేశ్వరుండును విరువాకొండును శశిశేఖరుండును గంగాధరుండును అంబికేశ్వరుండును నీలకంఠేశ్వరుండును ఇవ్వి మొదలుగాగల యీశ్వరస్థానంబులు ఇన్నూటగొబదియును శ్రీరంగనాయకులును శ్రీవేంకటనాథుండును శ్రీలక్ష్మీనరహరియును శ్రీసీతారాములును శ్రీకృష్ణగోపాలమూర్తియును శ్రీమత్స్యమూర్తియును ఆదివరాహస్వామియును శ్రీజగన్నాయకులును శ్రీజనార్దనుండును గోవిందరాజులును పాంచాలరాయుండును కల్యాణరాయండును ఆదిగాగలవిష్ణుభవనంబులు ఇన్నూరును విశాలాక్షి కామాక్షి భ్రమరాంబ శ్రీమహాలక్ష్మి భవాని మొదలయిన దేవీభవనంబులు నూరును వినాయకవీరభద్రనిలయంబులు యాబయును ఆదేవతలకు ప్రతిష్ఠలు చేసి రామారణ్య శ్రీపాదులు, త్రికూటనివాసులు, త్రిదండమునులును ఆశీర్వదించి ప్రోలరాజుకో వృత్తాంతంబంతయు చెప్పి యిట్లనిరి. నీవు నిత్యంబును శ్రీశంభులింగంబున నొక్కబారువగోహంబు దెప్పించి శ్రీశంభులింగంబు పూజోత్తరంబున స్పర్శచేయించిన అది శుద్ధసువర్ణంబగు అది నీవు నిత్యవినియోగంబు చేసికొమ్మనినా విని యారాజుబారు (వు) తెరంగెరింగించు మనుటయు రామారణ్య శ్రీపాదులట్లు కాక యని నూటఇరువై గురిజలయెత్తు ఒకతుల యనంబడు. అట్టి తులాలు నూటయిరువయి అయిన ఒక్క విశ యనంబడు. అట్టివిశలు నూటయిరువది యయిన ఒక్కనక యనంబడు. ఇది కలియుగవ్యవహారప్రమాణము బారువు అని యెఱుంగంబలికిన రాజుచేననుజ్ఞాతులై కావేశ్వరంబునకు ఋషులు చనుటయు.

అట ప్రోలరాజు మునులఅనుజ్ఞచే నిత్యంబును అయోగోహంబును బారువ తెప్పించి యాజ్యోతిర్మయం బగుస్పర్శవేధిశ్రీశంభులింగంబు పూజోత్తరంబున స్పర్శయు చేయించిన శుద్ధసువర్ణం బయ్యె. ఆద్రవ్యంబు దేవబ్రాహ్మణకార్యార్థంబుగా నిత్యవినియోగంబు సేయుటయు. అంతట నొక్కసుతుం డుద్భవించిన ఆవేళ యెఱింగి భూసురులు ఏకాంతంబునకు ప్రోలరాజును బిలిచి యీబాలునిచేత నీవు మృతి బొందగలవాడవు. ఈబాలుని నీవు చంపుమనుటయు. ఆమాట భూపాలుండు విని తనదేవియును తానును అబ్బాలుని మధ్యరాత్రియందు పరు లెవ్వరెఱుంగకుండునట్లుగా పోయి స్వయంభూదేవుని ముఖమంటపంబున పొత్తులు పరిచి యబ్బాలునికి స్తన్యపానంబులు ఇచ్చి పత్నీయుక్తుండై నిజనివాసంబునకుం జనుటయు.

అంత గుడికావలివారలు ఏతెంచి యీశిశువునుజూచి ఆశ్చర్యచిత్తులై రాజుసమ్ముఖంబునకు నతివేగంబున పరతెంచి అబ్బాలునితెరం గెరింగించుటయు ఆభూపాలుండు విని యెరుంగనియట్ల ఆశ్చర్యచిత్తుండై పుత్రమోహంబు మనంబునం బెనంగొని పురజనులయట్ల తానును శ్రీశంభులింగంబునగరికిం జని యబ్బాలునిం జూచి కటకటంబడి పెద్దపూజారిని బిలచి యీబాలుండు సర్వలక్షణసంపన్నుండు వీని రహస్యంబున పోషింపుమని రుద్రజియ్యరకు ఒప్పనజేసి యబ్బాలునకు రుద్రనామంబు బెట్టించుటయు. అంత నబ్బాలుండు దినదినప్రవర్ధమానుండైనం జూచి యారాజు విధ్యుక్తంబుగా ఉపనయనంబు జేయించి క్రమక్రమంబున అబ్బాలునకు వేదాధ్యయనాది సకలశాస్త్రంబులును ధనుర్వేదాదిసాధనాభ్యాసంబులును జితశ్రమంబును జేయించుటయు నంత నబ్బాలుండు నవయావనుం డగుటయు ఆభూపాలుండు ఆకుమారునిం బిలిపించి బహువిధంబుల గారవించి అతన్ని రెండువెయిలబంట్లు కొలుచునట్లుగా కట్టడిచేసి ఒరు లెవ్వరును తనయాజ్ఞ లేక శ్రీశంభులింగంబునగరు సొచ్చిరేని సంహరించుమని ఆజ్ఞ యిప్పించి యనుపుటయు.

ఆతనికుపరి నొక్కసుతుం డుద్భవించిన అతనికి మహాదేవరాజు అని నామకరణంబు సేయుటయు. ఆమహాదేవరాజుకు మహారోగంబు పొడమిన విద్వాంసుల తోడితెచ్చి వారిచేత రోగనివృత్తి యగుకార్యం బెరింగించుమనిన. అప్పుడు అయిదువేలపుట్లతిలలు పర్వతాకారంబుగా పోయించి తదాక్రమంబున పన్నెండుమణుములసువర్ణప్రతిమను కాలపురుషుండును ప్రతిష్ఠించి అరుణపుష్పాక్షతలు అవివస్త్రంబులు కట్టించి అలంకరించి పదిలక్షలసువర్ణనిష్కంబులును సదక్షిణలతోటి తనపురోహితుని బిలుపించి యిందుకు తగినవిప్రుని దెచ్చి పట్టించుమనుటయు, ఆపురోహితులు రాజుతో నిట్లనిరి. ఈపురంబున నున్నవిప్రులందరు దేవరవారిచే దానంబులు పట్టినవారలు (మరల) పట్టరాదు. మనపురంబున నొక్కబ్రాహ్మణుండు దూదికేశవపిన్నయభట్లనువిప్రుండును శుక్లభిక్షసేయుచు ఎవ్వరిచే దానంబు పట్టనొల్లక యుండును. అతన్ని దేవరవారు పత్నీసమేతులయి తద్గృహంబునకుంజని ప్రార్థించిన దానంబియ్యకొనును నని చెప్పిన ఆరాజు పత్నియు తానును ఉపవసించి ధవళవస్త్రంబులు గట్టుకొని విహితకార్యంబులు నిర్వర్తించి యాదంపతులు మధ్యాహ్నంబగుటయు, అంతట దూదికేశవపిన్నాభట్లయగృహంబునకుం జనిన. ఆవిప్రుండు వైశ్వదేవబలిహరణంబు గావిం

చునపుడు తనదేవియు తానును దీనాలాపంబున ప్రార్థించిన అవిప్రుండు తోయంజాలక దానంబు పరిగ్రహించిన రాజుకొమారునకు మహారోగంబును నివారణంబయ్యె.

అంత దూదికేశవపిన్నయభట్లు బ్రహ్మరాక్షసుం డగుటంగని ప్రోల్రాజు అతనిసతిని సుతులనును బిలిపించి అపారద్రవ్యంబు లొసంగి బహుజనంబుల సహాయంబుచేసి వారణాసికిం జని దోషవిముక్తి చేసికొమ్మని పంపుటయు. తత్ర్కియంబున సకలజనంబులు చూచుచుండ దూదికేశవపిన్నయ్య పుణ్యాలోకంబున కరుగుటయు. తదనంతరంబున ప్రోల్రాజు డెబ్బదిరెండువర్షంబులు మహామహిమశోభిల్ల రాజ్యంబు పాలించి షట్కాలపూజాపరుండు గావున నొక్కనాడు మధ్యరాత్రి శ్రీశంభులింగంబునకుం జని పరిజనంబుల బహిర్ద్వారంబునను నిలిపి తానొక్కరుండును మంటపంబునకుం జని ద్వారంబునకు నొక్కరుండును మహనీయతల్పంబున పవ్వళించి సుఖసుప్తుం డగుచు నతనసుతునింగాంచి యతని రూపురేఖలు చూచి కటకటంబడి పుత్రమోహంబున నతనికి నిద్రభంగంబు గాకుండునట్లుగా తలుపులు ఒరగిలంజేసి యద్దేవునిసమ్ముఖంబునకుం జని పూజగావించి తీర్థప్రసాదంబులు గయికొని మగుడ వచ్చునప్పుడు విధివశంబున ప్రోల్రాజు జంఘులు రుద్రమరాజు బొటిమనవ్రేలుకు తాకుటయు దిగ్గున లేచి దద్దరిల్లి ముచ్చుముచ్చనుచు తనచేసురియను బొడిచిన. అతడు రాజౌట యెరింగి గజగజ వడంకుచు ఆయుధంబు తియ్యకనిలిచిన సుతునింజూచి యారాజు గుడివెలుపల నున్న పరిజనంబుల బిలచి బహుదేశపతుల మంత్రిపురోహితుల సామంతుల పిలువుండని యానతిచ్చి అత్యంతభయాకులచిత్తుండై యున్నపుత్రునింజూచి నీవు భయపడకుమని వానితనదగ్గరకు పిలచి గాఢాలింగనంబు జేసి నీవు నాగర్భంబున పుట్టినసుతుండవని పూర్వవృత్తాంతంబు తెలియంబలికి పుత్ర తనకు కారణంబు ఇంతయున్నది. నీవు జేసినపని గాదు. విచారపడకు మని గారవించి. అంతః నా రాజుసమ్ముఖంబునకు భృత్యులు తోడితెచ్చినపురోహితప్రధానులకు ఆపోటు జూపి యితడు తనగర్భజాతుం డగునానుతుండు. వీనికి పట్టంబు గట్టుండని చెప్పి తత్క్షణంబే రుద్రమహారాజును పట్టాభిషిక్తునింజేసి పద్మాక్షిదేవీదత్తంబైన ఖడ్గఖేటకంబులు సింహాసనంబున నిలిపి గండపెండారంబులు నతనికి ఇచ్చి దినత్రయంబు నిలిచి ప్రోల్రాజు కైలాసనివాసుం డగుటయు.

## రుద్రమహారాజుచరిత్రము.

రుద్రమహారాజు పట్టాభిషిక్తుండై రాజ్యంబేలుచు అయినవోలు మైలారుదేవునకును వడ్డెపెల్లివినాయకదేవరకున్ను మొగ్గిచర్లయేకాన్వీరాదేవికిని గుళ్లుకట్టించి ప్రతిష్ఠలుచేసి తనయాజ్ఞకు మరల బడ్డకటకవల్లభునిపైం జని వానిసాధించి వాని సుతునకు పట్టంబుగట్టించి మూడుకోట్లసువర్ణటంకంబులు అప్పనంబులు పుచ్చుకొని వెలనాటిపృథివీశ్వరులపై దండువెడలి వారిని సాధించి వరాహలాంఛనంబులు పుచ్చుకొని మగుడ పురంబు ప్రవేశించి తండ్రిని పొడిచినదోషంబు విముక్తిగా నట్లుబుధానుమతంబున వారణాసికిం జని గంగాస్నానంబు చేసి అనేకసువర్ణంబులు విప్రుల కొసంగి విశ్వేశ్వరు దర్శించి షోడశోపచారపూజాప్రకారంబులు మహామహిమతో జేయుటయు. తదనంతరంబున గయకుం జని పితృదేవతలకు మోక్షంబుగలుగునట్టి పితృయాగంబులు చేసి కృతార్థుండై మరియు శ్రీశైలంబునకుం బోయి మల్లికార్జునలింగంబు సేవించి అచట మూడుతులాభారంబులు తూగి కోటిసువర్ణంబులు దానంబులు చేసి యేకశిలానగరంబునకు వచ్చి తత్పుర మధ్యప్రదేశంబున ముప్పదిమూడుకోట్లసువర్ణంబులు దెప్పించి సహస్రశివాలయంబులు గట్టించుటయు, మరియు హనుమకొండను సహస్రస్తంభశివాలయంబులు గట్టించుటయు. మరియు గ్రామంబుల శివాలయంబులు గట్టించుటయు. అందుల రుద్రేశ్వర ప్రతిష్ఠలు సేయుటయు, దిగ్విజయంబులు చేసి మగుడ పురంబునకు వచ్చి తనతమ్ముండైన మహాదేవరాజుదుర్మంత్రం బెరింగి అతని పురివెడలించుటయు, తనకు సంతానంబు లేక చింతించి శ్రీశైలంబునకు పత్నీయుక్తుండై చని శ్రీమల్లికార్జునలింగంబు సేవించి అచటనున్నసిద్ధులను మఠపతులను నానావస్తు సముదయంబు వారలచిత్తంబు ప్రసన్నంబగుటయు, పూజలు నడిపి వారలప్రసాద లబ్ధంబున ఒక్కసుతునింగని గణపతిదేవుం డనునామకరణంబు సేయుటయు, మరికొందరిసుతులం గాంచుటయు. అంతట పాండ్యదేశాధీశ్వరులపై దండయాత్రవెడలి వారిని సాధించి అతని సుతునకు పట్టంబుగట్టి వారిచే కోటిసువర్ణనిష్కంబులు అప్పనంబులుగైకొని సేతుబంధనరామేశ్వరంబునకుం జని ధనుష్కోటిలో స్నానంబుచేసి యెనిమిదితులాభారంబులు తూగి మగుడి ఏకశిలానగరంబునకుం జని. మహాదేవరాజు కొందరిపరిజనంబుల వశంబు జేసుకొని రుద్రమహారాజును పొడిచిన వానిసుతునికి పట్టంబుగట్టుమనిన వారలు మహాదేవరాజుతో నిట్లనిరి.

నీవు రుద్రమహాదేవరాజును వధించిన అన్యాయంబుగాక యారుద్రమహారాజ సుతుండు గణపతిదేవునికి పట్టంబుగట్టి నిన్నుయువరాజుపట్టంబు గట్టుట నీతి యగు. అట్లుచేసిన మహాదేవరాజు మూఁడుఏండ్లు గణపతిదేవరాజుసహితంబుగా రాజ్యంబుచేసి దేవగిరిమీఁదికి దండుగూర్చుకొని పోయి వారితో మహాదేవరాజు మూసదప్వయంబు అఘోరయుద్ధంబు జేసి దేవగిరిరాజులు సేయుగజయుద్ధంబున మహాదేవరాజు సమయుటయు.

## గణపతిరాజు చరిత్రము.

అంత గణపతిదేవుఁడు తనపిన్నతండ్రిని జంపినారని దేవగిరిరాజులవంశ క్షయంబు జేయుటయు. హతశేషులు భయాకులచిత్తులై కోటిద్రవ్యంబులు కాను కగాఁ బట్టి గణపతిదేవునకు తమకూతురు రుద్రమదేవిని సర్వాభరణభూషితం బుగఁజేసి కానుకగాఁ బట్టిన ఆకన్యను వివాహంబై ఏకశిలానగరంబునకుఁ జను టయు. తనకు మరిలబడ్డతమ్ములను బరిహరించి పట్టాభిషిక్తుడై వరంగంటికి శిలాప్రాకారంబులు ఏర్పరచుటయు చేయంగలదేవాలయంబులు పూర్తిగా కట్టిం చుటయు అంత నెల్లూరినుండి తిక్కనసోమయాజులు ఏతెంచిన అతని ఎదు ర్కొని గణపతిమహారాజు వినయంబున భయభక్తిని అతిథిపూజ గావించి యత నిచే మహావేదార్థవ్యాఖ్యాన ద్వైతాద్వైతంబు లగుజీవచిద్వివేక లక్షణంబు లును ధర్మాధర్మంబులును రాజనీతిప్రకారంబులును భారతపురుషప్రసాదం (ప్రతా పం)బును ఆదగాగల అర్థంబులును వినుచు నంత హనుమకొండనివాసు లగుబౌ ద్ధవు (బౌద్ధు)ల రావించి వారలు తిక్కనసోమయాజులవాక్యశక్తికి మెచ్చి యతని బహుప్రకారంబుల పూజించి యెనిమిదిగ్రామంబులు నొసంగి యతడు వచ్చిన కార్యం బడిగిన తిక్కనసోమయాజులు ఆభూపాలునితో నిట్లనిరి. సూర్యవంశ జుం డగుమన్మథసిద్ధరాజు నెల్లూరు ఏలుచుండగాను అతనిదాయాదులు అక్కన భీమన్న నతని బంధించి రాజ్యంబు యేలుచున్నవారు. మీరు అక్కడికివిజయంబు చేసి మన్మథసిద్ధరాజును పునరభిషిక్తుని జేయువలయు ననుటయు గణపతిరాజు అట్లకాకయని ఒడంబడిన. అతనికి లక్షద్రవ్యంబు యజ్ఞంబునకు ఇచ్చి యజ్ఞకుండ లంబులు చేయించి అనుపుటయు. రాజుచే ననుజ్ఞాతుండై పోవునప్పుడు ఆరాజు సింహాసనంబున మంత్రియై యున్నశివదేవయ్యగారినిం జూచి యతండు ఈశ్వరుం డునుంగాని మనుష్యమాత్రుండుగాడు. నీవు రాజ్యభారంబు ఆతని యనుమతిం జేయుమని చెప్పి చనుటయు తదనంతరంబున గణపతిరాజు శివదేవయ్యఅనుమతి

గైకొని ప్రయాణభేరి వేయించిన చతురంగబలసమేతుండై మున్ను వెలనాటిరా జుల గెల్చి వారల తనయాజ్ఞకు లోనుజేసి వారిచే అప్పనంబులుగయికొని అంత నెల్లూరికింజని అక్కనబయ్యనవారిని భేదించి మన్మథరాజును పునరభిషిక్తునిం జేసి రెండువేయిలనూరుగ్రామాలు అతనికి జేసి కడుమగ్రామాలు తనవశంబు జేసుకొని నెల్లూరు(న) ఒక్కతటాకంబు గట్టించి సిద్ధిరాజుతో పూజితుండై మగుడ గంగాతీరంబునకు వచ్చి పెక్కుశివాలయంబులు గట్టించి రెండుగోపురం బులు గట్టించి యెనిమిదితులాభారంబులుతూగి గణపురంబుగట్టించి అచ్చట నొక్కతటాకంబును గట్టించుటయు మరియు ఏకశిలానగరంబునకు వచ్చియు నగరిలో అనేకరాజగృహంబులు గట్టించి తననగరికి ఇటికెకోట ప్రాకారంబును గట్టించి మరియు నొడ్డెవార్ధువుల దండువెడలి వారిని సాధించి వారిచే అప్పనం బులు పుచ్చుకొని తనయాజ్ఞకు లోనుజేసుకొని శ్రీగిరి దర్శించి మల్లికార్జునలిం గంబు సేవించి పన్నెండువేయిలసువర్ణకమలంబులం బూజించి పంచయామంబుల సేవించి షోడశమహాదానంబులుం జేసి అడుప గుండయ్యను పిలుపించి వారికి యెల్లూరు సర్వమాన్యంబుగా నొసంగి యొక్కతటాకంబు గట్టించి. యంత గణ పతిదేవుండు పండితారాధ్యులచే దీక్ష గయికొని అతనికి రెండుగ్రామంబుల నొసంగి రాజ్యంబునం గలగ్రామంబులన్నిటం శివాలయంబులు గోపాలనిలయం బులు గట్టించుటయు, గణపతిదేవుండు శ్రీరామరాజ్యంబుచందంబున తనకు భోజ నంబులకు సకల వస్తువుల సామగ్రిగా రాజ్యం బేలుసమయంబున.

గుండా బ్రహ్మయ్యగారికథ.

ఒక్కనాడు దక్షిణదేశంబుననుండి గుండాబ్రహ్మయ్యగారు శివభక్తితాత్ప ర్యంబులై శరణాగతిరక్షకత్వంబు అది తమకు వ్రతంబుచేసుకొని శివభక్తి నడు పుచు ఏకశిలానగరంబునకు పన్నెండుబిడారంబులు సకలవస్తువులు నింపుకొని గవినిచెర్లకాడ వ్యవహారంబులు సలుపుచున్నసమయంబున శ్రీమన్మహాదేవుండు వారలవ్రతంబు చూచుటకై కాలుని బంపిన. అక్కాలుండు చోరరూపంబు దాల్చి గణపతిదేవునినగరుకు కన్నంబు పెట్టి సమస్తవస్తువులు సామగ్రి ముచ్చిలి వచ్చుసమయంబున ఆనగరికావలివారలు ఎఱింగి యచ్చోరుని వెంటతగులుటయు ఆచోరుండు వారలకు చిక్కక పురంబు వెడలి గవినిచెర్ల నున్నగుండా బ్రహ్మయ్య గారికడకుం జని తనవెంటతగిలివచ్చురాజభృత్యులం జూపి తాను తస్కరుం డను, రాజగృహంబు కన్నంబుపెట్టినవాడను, నేను ఎట్లకేలకు పారిపోవుసమయం

బున మీకుశరణుజొచ్చితి. నన్ను బ్రతికించుకొండని దీనాలాపంబుల బ్రార్థించిన విని వారు తస్కరుని చేరందిగిచి వెన్నుచరచి అభయంబిచ్చి వెనుకకు తీసుకొని.

అంతట నారాజభృత్యులు తస్కరుసిపట్టుటకై తమ్ము చేరవచ్చినవారల నిలువ నిలువుమని వారలతో మేము శరణాగతరక్షకత్వం బని వ్రతముగై కొన్నవారము. ఈతస్కరుండు మాకు శరణుజొచ్చినవాడు వీని మీకు ఇయ్యకుండుట నిజం బని వాదించిన రాజభృత్యులు అతివేగంబున పరుతెంచి యాభూపాలునితో విన్నవించిన గుండా బ్రహ్మయ్యగారిని రావించి చోరుని ఇమ్మని అడిగిన వారలు విని రాజుతో నిట్లనిరి. మేము శరణాగతరక్షకత్వంబు వ్రతంబు గై కొన్న వారము. ఈతస్కరుండు మాకు శరణుంజొచ్చిన వాడు వీనినియ్యము. ఇయ్యకుండుట నిజము. మీకు ఎట్టిదండుగు నడిగిన నిచ్చెదము. అదిగాక చంపదలంచితిరేని ఈచోరునకై మాయిరువురప్రాణంబులు ఇచ్చెదము, గైకొమ్మని పలికిన ఆరాజు అట్లకాక యని తనపరిజనంబులతో వీరల సర్వధనంబుల గొని వీరల శూలప్రాప్తులం జేసి యచ్చోరుని విడువుండని యాభూపాలుండు యాజ్ఞాపించిన ఆపరిజనంబులు ఏతెంచి వారలదోడ్కొనిపోయి గవినిచెర్లను శూలంబులు పాతించి వేయునప్పుడు అపురిశివభక్తులు పుణ్యపురుషులు పుణ్యాంగనలును మరియు నానాజనంబులును ననేకంబుగాగూడి చోరునకై తమప్రాణంబులు ఇచ్చుచున్న వార లనియు చూడం జనుదెంచుటయు. అట్టిసమయంబున గుండా బ్రహ్మయ్యగారు తమరు గట్టికొన్నవ్రతంబు కడతేరచెల్లెనని సంతోషచిత్తులై శివలింగంబుల పూజించుకొని శూలంబుల బడిన సకలజనంబులు చూచుచుండ శూలంబులు కుసుమకోమలకుట్మలంబు లయ్యె. అప్పుడు శ్రీమన్మహాదేవుండు ప్రత్యక్షంబై పుష్పవృష్టి గురియించుటయు. వారల దివ్యవిమానంబు లెక్కుమనుటయు వార లిట్లనిరి. మేము శరణాగతుని విడిచి యెట్లు విమానంబు లెక్కెదము. మావెంటనే చోరునకు కైలాసంబు కృపసేయు మనుటయు అప్పుడు కాలుండు చోరరూపంబు మాని మహిషారూఢుండై నిజరూపంబు జూపుటయు గుండా బ్రహ్మయ్యగారు కైలాసనివాసుం డగుటయు.

ఏకశిలానగరంబునకు నైరృతిభాగంబున యోజనత్రయదూరంబున నొకగొప్ప మహాతటాకంబు గట్టించి అకర్కడ గణపురంబను గ్రామంబుగట్టించి అచ్చట శివాలయంబులు ప్రతిష్ఠించి రాజ్యంబుపాలించి ఏకశిలానగరంబునకు పశ్చిమ భాగంబున యోజనత్రయదూరంబున విదశనగరం బహుపురంబును గట్టించు

టయు మహాతటాకంబును గట్టించుటయు. అంతట కటకవల్లభునిచే మూఁడువేలవర
హాలు అప్పనంబుఁగొని గోదావరీగర్భంబున గొన్నిక్రతువులు గావించి రాజ్యం
బేలుసమయంబున నొక్కనాఁడు సిద్ధుఁడు చనుదెంచి గణపతిమహారాజునమ్ము
ఖంబున నిలిచి నేను యోగసిద్ధిగొరకు భూనభోభాగంబులు సంచరించివచ్చుటం
జేసి మహాదాహంబు జనియించె. అందుకు శతఘటంబులు గోక్షీరంబులు
ఉష్ణంబులు పితికిపోయించినగాని నాదాహంబు మానదని సిద్ధుండు పలికిన
ఆతత్క్షణంబే తన ధేనువుల తోడితెప్పించి శతఘటంబులు పితికిపోయించిన
వొక్కఅన్నియు ద్రాపి గుర్రున దేచిన-జూచి గణపతిమహారాజు ఆశ్చర్యచిత్తుం
డయ్యె. మరియు నాసిద్ధుండు గణపతిరాజును హనుమకొండకు గొనిపోయి యా
కొండమీద సూర్యునిక్కన మహాకాకెట పాషాణంబు తెగనరికించి అందు ఒక్క
దోన యాసిద్ధుండు గణపతిరాజుకుం జూపి యిది కేదారతీర్థంబును ఇజ్జలంబులు
హేమమోదకంబులుగాని సహజంబులు గావు. హేమసకాశంబు లైనజలంబుల
జూచి రాజు ఆశ్చర్యచిత్తుండయ్యె. ఆసిద్ధుండు అదృశ్యుంబయ్యె. అంత నక్కడ
కేదారలింగంబును హనుమద్గిరినాథుండును హరిహరుల ప్రతిష్ఠలు చేయించి గణ
పతిరాజు ఏకశిలానగరంబునకుం జనుటయు. అంత నారాజు సంతానంబు లేమికి
జింతించి పద్మాక్షిదేవీవరప్రసాదంబున నొక్కకన్యకారత్నంబునుం గని ముమ్మక్క
యను నామకరణంబు జేసి యక్కోమలి నవయౌవనురాలగుటంజూచి చాలు
క్యతిలకుం డగువీరదేవరాజునకు వివాహంబుజేసి యెనిమిదికోట్ల సువర్ణంబులు
నిక్షేపంబు జేసి తనపురంబునం గలఅగ్రగణ్యులంజూచి మీకు నాయకత్వంబు
ఇచ్చెదమునిన. మాకు క్షాత్రధర్మంబులు ఒప్పనని ఊరకుండిరి. మరియు నానా
వర్ణమండలి ఖడ్గబిరుదు చెల్లించుకొనుటయు, ఇట్లు గణపతిదేవుండు డెబ్బదియే
డేండ్లు రాజ్యంబు చేసి మహామహిమతో పాలించి అంతట శివలోకంబున
కేగుటయు.

## రుద్రమదేవి రాజ్యము.

అమ్మహారాజుపట్టంపుదేవి వీరపతివ్రత యైనపద్మాక్షీదేవి వరదత్తంబైన
ఖడ్గఖేటకంబులు సింహాసనంబున గూర్చుండి తనఅనుమతంబున రాజ్యంబు
పాలింపుచుండె. చేయంగడమ యైనసకల(దేవాలయంబులు) మహోన్నతంబులు
గాఁ గట్టించుటయు. తనభూమిప్రజలకు తాను భూమికోట పెట్టించుటయు.
రాళ్లకోటకు నాల్గుగ్రామములును నాలుగుదిక్కు ఏర్పరుచుటయు, భూమికోటకు ఏని

మిదిగానులును పదహారుదిక్కు ఏర్పరుచుటయు. అనేకశివాలయంబులు కట్టించి పురబాహ్యాంగణంబుల సువర్ణమయఫలవృక్షంబులు వేయించుటయు, అయిదు వేలవిప్రులకు వివాహంబులు చేయించి నాల్గుకోట్లనిక్షేపంబులు సువర్ణంబులు చేయించుటయు. కటకవల్లభునిపై దళంబులు నడిపి వానిచే అశ్వంబులు గయికొని వానిని తనయాజ్ఞకు లోనజేసుకొని తనకూతురు అయినముమ్మక్కమహాదేవికి ఈశ్వరాంశసంభవుం డయినమంచిసుతుండు కావలె నని సిరిపుట్టెడ్ల నోములు నోమించి తమయిలువేల్పు అయినకాకితమ్మకు ఉత్సవంబులు చేయించి వడ్డెపెల్లివినాయకునకు మొగ్గిచెర్ల యేకవీరాదేవికి, అయినవోలు మైలారుదేవునకును సకలదేవతామహోత్సవంబులు చేయించుటయు అయిదుదివసంబులుపురంబు వెలువడి. సవతిసుతులై సహాయహీను దేవుండును మురారిదేవుండును కొండపరిజనంబుల గూర్చుకొని పట్టణంబు గానుక చేయించి పౌరనియ్యక మనిబద్ధ వారల సామోపాయంబున మప్పుపరిచి తాను పురంబుప్రవేశించి వారలబంధించి పుత్రమిత్రసహితంబుగా మనిమించుటయు, హనుమకొండ ప్రవేశించి సహస్రపద్మంబుల పూజించి పద్మాక్షిదేవి నిత్యమహోత్సవంబు గావించుటయు. విప్రభోజనంబులు గావించుటయు అంత దేవగిరిరాజు సమస్తసేనాసమేతుండై యేకశిలానగరంబుపై విడియుటయు వారలతో నెదిరించి ఒక్కపక్షంబు అఘోరయుద్ధంబు చేసి మూడులక్షలపదాతులను లక్షగుఱ్ఱంబులు బట్టి వారలబలంబు వెనుకతగిలి దేవగిరిజొచ్చుపర్యంతంబు తరుముకొని పోవుటయు. వారలు కోటిద్రవ్యంబులు కానికగాం బట్టిన ఆద్రవ్యంబు తనసహదార్లకు పంచిపెట్టించి అచ్చట జయస్తంభంబులు వేయించి వారల తనయాజ్ఞకు లోనుజేసికొని మగుడ ఏకశిలానగరంబునకు వచ్చి. అంత సమస్తబంధుసామంతవర్గంబులు తమకొమారుల యీరుద్రమదేవిపేరు పెట్టుటయు, మరియు జనంబులు తన్ను అంబా యని పలుకుటంజేసి అంశాల యనేగ్రామంబు గట్టించుటయు, నిజనామంబున ముద్రవరంబులను వేయిపురంబుల నానాదేశంబుల గట్టించుటయు, అష్టదిక్కులను జయస్తంభంబులు వేయించి మహామహిమతో రాజ్యంబేలుసమయంబున ముమ్మక్కమహాదేవికి నెలలు నిండుటంజేసి శివదేవయ్యగారిని రావించి పూజించి యీశుభవార్త నెరింగించిన నామహాత్ముం డిట్లనియె. ఈముమ్మక్కగర్భంబున బాలుండు సర్వలక్షణసంపన్నుండును విక్రమధనంజయుండును, త్యాగరాధేయుండును, సత్యయుధిష్ఠిరుండును నగునొక్క పుత్రుండు గల్గు నిజంబు. ఈబాలుండు [illegible]



గాని మనుష్యమాత్రుండు గాడు. పుట్టునప్పుడే యిబ్బాలుండు సింహాసనం గలడు. ఈవచనంబు సత్యం బనిన నత్యంతహర్షంబున సంతోషితచిత్తయై శివదేవయ్యవచనంబులు తనసామంతవర్గంబున కెరింగించి పురంబునం గలదేవాలయంబులు శృంగారింపఁజేసి యద్దేవతల మహావైభవంబున బూజించి నృసింహరాయల పంచమహావాద్యంబుల నుంచి ఆపురంబు శృంగారించి భూసురుల బిలిచి సౌభాగ్యమై యిలవరహాలు పంచిపెట్టించి సామంతవర్గంబునకు చీనిచీనాంబరంబులు మణిమయాభరణంబులు నొసంగి మీకు రాజు గల్గుచున్నాడని యెరుగంబల్కిన అద్దేవి క్రమక్రమంబున ముమ్మక్కకు గర్భదోహదాదికంబులు చేయుచుండ దశమమాసంబున శాలివాహనశకవర్షంబులు.........ఆనందనామసంవత్సర చైత్రశుద్ధపంచమీ గురువారంబున రోహిణీనక్షత్రంబున బ్రహ్మముహూర్తంబున సూర్యాంగారకబుధబృహస్పతు లుచ్చక్షేత్రస్థానంబున శనైశ్చరుండు నిజస్థానంబున నుండునట్లుగా ముమ్మక్కదేవికి సుతుం డుద్భవించిన నుద్రమదేవులు ఏతెంచి యబ్బాలునిశరీరంబు శుద్ధోదకంబుల గడిగి కొలువుకూటంబునకు గొనితెచ్చి సింహాసనంబున పొత్తులు పరచి యమ్మహారాజుబాలు నునిచి యేకశిలానగరంబునం గలప్రజలను బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రాదులను ప్రధానులను సామంతులను మన్నీల దొరల భటవర్గంబును నానావర్ణంబులను ఆదిగాగల్గుడెబ్బయిరెండుని యోగంబులవారిని రావించియమ్మహారాజుబాలునిం జూపి మీకు రాజు అనిన సకల జనంబులును సంతోషంబున ఆనందంబున నోలలాడి యబ్బాలుని దీవించిరి. ఆరుద్రమహాదేవులు శివదేవయ్యగారిచే బాలునకు విభూతి ధరియింపంజేయుటయు. పుత్రోత్సవంబున విప్రులకును వీరువా రనక ఆబాలవృద్ధగోపాలంబుల కందరికిని అయిదుకోట్లవరహాలు పంచిపెట్టించుటయు. చీనిచీనాంబరంబులొసంగుటయు. ఆవిప్రులకు లక్షధేనువుల నొసంగుటయు. సమస్తవైభవంబులు గావించి పుత్రోత్సవంబు చేయుటయు, ఆరుద్రమదేవులు సకలజనంబులసంతోషంబులు గావించి యబ్బాలకు నొక్కదివ్యమందిరంబున నవరత్నఖచితం బైన ఒకతొట్లిలో నునిచి పెంచుతుండే యబ్బాలునకు సూతికాగృహంబుచుట్టును ఆప్తుల నునిచి. మంత్రికుల సుతునిం యాబిడ్డలం గన్నవృద్ధాంగనలన్ నిత్యంబున బాలుని జూచుటకు నలుబంత్రు నుండునట్లుగా నియమించి విధ్యుక్తంబుగా పుణ్యాహావచనంబులు చేయించి అపారద్రవ్యంబులు భూసురుల కొసంగి శివదేవయ్యగారినిం జూచి యిబ్బాలునకుఁ మీనామకరణంబు సేయుమనుటయు